# ఆంధ్ర సచిత్ర వార పత్రిక

27-12-68



40 పైసలు.

గనిసెట్టి

# ఉత్తరాలు

## ముఖచిత్రం

13—12—68 ఆంధ్రసచిత్ర వారపత్రికలో ముఖచిత్రం నాగేశ్వరరావు, అది ఏ సినిమాలోనున్నది?

**బంగారుగాజులు చిత్రం లోనిది.**

జి. దయాకర్‌రెడ్డి (గుండ్లగూడెము)

*   *   *

ఈ వారం పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారి ముఖచిత్రము పత్రికకు ఎంతో వన్నె తెచ్చినది. రామలక్ష్మి గారి సీరియల్ బాగున్నది.

నందిరాజు సాంబశివరావు (విజయవాడ)

*   *   *

శ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారి ముఖచిత్రం ఈ వారం (13—12—68) పత్రిక కెంతో అందాన్ని తెచ్చినది.

"గార్డు" ట్రాజడీ కథ చాల బాగుంది. రచయిత గార్డు పాత్రను చాల బాగా సృష్టించారు—రచయితకు ధన్యవాదాలు.

"పద్మశ్రీ అంటే అర్థం ఏమి?" ముగ్గురు. మూర్ఖుల వివరణను "మహేష్" బాగా వ్రాశారు

'ఒకవారం విపరీతం", "ఆ అమ్మాయి" కథ, "ప్రేమించు ప్రేమకై" సీరియల్, జీవిత వలయాలు, కాత్యాయని కలలు సామాన్యంగా ఉన్నాయి. రచయితలకు ధన్యవాదాలు.

"ఖజురాహో వ్యాసం, ఫోటోలు బాగున్నాయి.

ఎస్. ఎల్. నరసింహం పి. ఆర్. కె. రాజు,
వి. యస్. రావు (వనపర్తి)

*   *   *

13—12—68 తేది వారపత్రిక నాగేశ్వరరావుగారి చిత్రముతో చాలా బాగా వున్నది. ఈ వారం 'బ్రతకలేక పోతున్న బడిపంతుళ్ళు' గూర్చి వ్రాసిన వ్యాసం బావున్నది.

జి. సుబ్బాయమ్మ (మండపేట)

## కథలు

ఈ వారం పత్రిక సంపూర్ణత చేకూర్చినట్లనిపించింది. ముఖ్యంగా ఎస్.రంజాన్‌బి గారి "కాత్యాయని కలలు" అను కథ పత్రికకెంతో వన్నె చేకూర్చించింది' తరువాత మహేశ్‌గారి 'పద్మశ్రీకి అర్థం వుందా" చాల బావుంది. "మతిమరుపు" అను శీర్షిక విద్యార్థులకు ఎంతో ఉపయోగపడుతుంది.

ఈ విధంగా పాఠకుల మనోవికాసం కొరకు అందజేసిన రచయితలకు మా అభినందనములు.

బి. సత్యనారాయణ (పెద్దపల్లి)

*   *   *

'పద్మశ్రీకి అర్థం ఉందా?' అనే మహేష్ వ్రాసిన సంభాషణాత్మక విమర్శ నాకెంతగానో నచ్చింది.

నేటి సినిమా నటుల అభిమానుల్ని వారి మూఢాభిమానాల్ని నిశితంగా విమర్శించారు.

మహేష్‌గారి వ్రాతలో చీకటి ఏమాత్రంలేదు. ఈ రచయిత చూపిన 'పద్మశ్రీకి అర్థం ఉందా?' అనేది నిజానికి ఆలోచన చేయాల్సిన సమస్యే.

దీనికి అర్థమే వుందంటే వారెలా నిరూపిస్తారో చూడాలని వుంది నాకు.

విఘ్నేశ్వరరావు (చల్లపల్లి)

*   *   *

13—12—68 వ తేదీ వారపత్రికలో, "ముగ్గురు మూర్ఖులు" పద్మశ్రీకి అర్థము ఉందా? అని వ్రాసిన శ్రీ మహేష్‌గారి రచన చదివినాను. సినిమా ప్రేక్షక సంఘాల కర్తవ్యాన్ని సహేతుకముగా వ్రాసినారు. వారికి నేను కృతజ్ఞుడను.

స్వరాజ్యము వచ్చిన తరువాత దురదృష్టశాత్తూ మనకు లక్ష్యం పోయింది. దేశాన్ని బాగు చేసికొని పూర్వపు అవున్నత్యానికి పోవలయునన్న కాంక్ష నశించినది. మానవులలో దాగియున్న తృష్ణ, ఈర్ష్య, అసూయ, వ్యామోహములు ఒక్కుమ్మడిగా విలయతాండవం చేస్తున్నవి.

ధర్మ ఉపన్యాసాలతో ప్రభుత్వం ఒక వంక, పలుకుబడితో వ్యామోహితుని చేస్తూ పారిశ్రామికుడు ఒకవంక, పదవీ వ్యామోహంతో పలుకుబడిని పెంచుకొనుటకు వ్యక్తులు సంఘముల రూపముతో ఒకవంక, నిరక్షరాశ్యులయిన ప్రజానీకాన్ని విభిన్న మార్గములలో పెట్టుచున్నారు. ఎవరికి వారు మంచి ఆదర్శ వంతులమని గర్విస్తున్నారు. నేడు కావలసినది యీ ముగ్గురు ఏక త్రాటి మీద నడచి సహనం, సహకారం, సమన్వయములతో ప్రేక్షకుని ఉత్తమ రస పిపాసిగా చేయటం మాత్రమే.

వ్యాపార దృష్ట్యా కొంత ప్రచారం చేసినను కనీసం పత్రికలు యిట్టి వ్యాసం ద్వారానూ, సాంకేతిక, కళా విషయములను ప్రేక్షకునికి ఎరుకపరచిన కొంతకాలానికి విజ్ఞానవంతుడైన ప్రేక్షకుడే వీరి అందరికి తగు సన్మానములు చేయగలడని నా విశ్వాసము. శ్రీ మహేష్ ద్వారా యిట్టి రచనలను ప్రోత్సహించమని మిమ్ములను కోరుచున్నాను.

గుండు కృష్ణమూర్తి
కార్యదర్శి
గుంటూరు ఫిలిమ్ ఫాన్స్ అసోసియేషన్
గుంటూరు.

*   *   *

చక్కని భావాలతో సులభ శైలితో పాఠకులలో కాత్యాయనిపై జాలిని కలిగించే "కాత్యాయని కలలు" రచయిత్రి యస్. రంజాన్‌బి గారు ఇకముందు కూడ మంచి రచనలు అందజేయగలరని ఆశిస్తున్నాను.

యం. పార్థసారథి (నంద్యాల)

*   *   *

# రచయితలకు మనవి

**కథలు, వ్యాసాలు**

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపకోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంప రాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్ను పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

**నవలలు**

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్ను పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పైబడి ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణించ బడుతాయి.

**కార్టూన్‌లు**

ప్రచురణకి స్వీకరించబడని కార్టూన్లు తిప్పి పంపకోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్ను జతపరచి పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లని వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమంతా ఎటువంటి బాధ్యతని స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్రసచిత్ర వారపత్రిక

# ఉత్తరాలు

ఈ రంజాన్ నెలలో యస్. రంజాన్‌బి గారిని తన "కాత్యాయిని కలలు" ద్వారా పాఠకలోకానికి ప్రప్రథమంగా పరిచయం చేసినందులకు (ఆంధ్ర సచిత్రవారపత్రిక 13—12—68) మీకు నా ధన్యవాదాలు. 'కలలు' చదవటం ముగించిన తరువాత అవి కలలుగా కనుపించలేదు. వాటిలోని ప్రతి ఘట్టమూ జీవితములోని ఏదో ఒక యదార్థాన్ని, దాని నిజస్వరూపాన్ని బట్టబయలు చేస్తుంది. బరువు బాధ్యతలు ఒకవైపు, నిరాశ, నిస్పృహలు మరోవైపు వీటి మధ్య తమతమవుతూ తానొక డాక్టరై ప్రజాసేవకై తన జీవితాన్ని అంకురార్పణ చేయాలని ఎన్నెన్నో కమ్మని కలలు గన్న కాత్యాయిని నిజ జీవితము ఒక అగాధమైన విషాదగాథ.

ఉపాధ్యాయ వృత్తి చేబట్టి చాలీచాలని జీతంతో పొట్టపోసుకుంటూ అడుగడుగునా ఎదురొచ్చే ఎన్నో క్లిష్టసమస్యల పరంపరల నెదుర్కొంటూ తన జీవితమంటేనే విరక్తి చెందినప్పటికి తన ఇద్దరి చెల్లెళ్ల, తమ్ముని యోగక్షేమాలే తనవిగా భావించుట ప్రస్తుత జీవితంలో తనకు ఒక పెద్ద గీటురాయి.

శంషాద్ బేగమ్. (హైదరాబాద్)

**వ్యాసాలు**

కాన్పూరు నుంచి కొందరు పాఠకులు, ప్రొ. సి. ఆర్. రావు గారికి ఎఫ్. ఆర్. ఎస్. వచ్చిన రెండేళ్లకు పరిచయం చేశారని ఆక్షేపణ తెలియబర్చారు. వ్యాసకర్తగా పరిస్థితి విశదపరచవల్సిన బాధ్యత నా మీద కూడా కొంతవరకు వుందనుకొని ఈ పుత్తరం వ్రాస్తున్నాను. ఆయనకు ఎఫ్. ఆర్. ఎస్. వచ్చిన సందర్భాన్ని పురస్కరించుకొని వ్యాసం రాయలేదు. పైగా రెండేళ్లయినంత మాత్రాన ఎఫ్. ఆర్. ఎస్. విలువ ఏమీ మారదు. ఎఫ్. ఆర్. ఎస్ ఒకటే గాక ఆయన సాధించిన ఘనవిజయాలన్నింటినీ దృష్టిలో వుంచుకొని వ్యాసం రాయడం జరిగింది. మన దేశంలోని ప్రసిద్ధ శాస్త్రవేత్తలను గురించి పరంపరగా రాయాలనే నా ప్రయత్నంలో యిదొక భాగమని గమనింప గోరుతున్నాను చిత్తగించండి.

డా॥ ఆర్. ఎల్. ఎన్. శాస్త్రి

* * *

13—12—68 పత్రికలో కాన్పూర్ మిత్రత్రయం వారి విమర్శ దురదృష్టకరమని భావించిన "ఎన్నార్" గారి ఉత్తరం చూచి విచారించాను. మాలాసిన్హా బిడ్డ బరువు, రాజశ్రీ ఇంట్లోని ఎవర్ సిల్వర్ పాత్రలు గురించిన మీ వార్తలు "ఎన్నార్" వంటి పాఠకులకు అత్యవసరమని తెలిసికొని ఏడ్వలేక నవ్వుకొన్నాను. (13—12—68). మాలాసిన్హా ప్రసవానికి సహాయం చేసిన మంత్రసాని పేరూ, రాజశ్రీకి పాత్రలు అమ్మిన దుకాణం పేరూ కూడా వేయలేకపోయారా? చాలామంది చదివి తరించి ఉందురు.

స. రజనీకాంత్ (మదరాసు)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 27—12—'68
కీలకనామ సం॥ పౌషమాసం శుద్ధ అష్టమి

**సంపుటము : 61 సంచిక : 18**

స్థాపితము:
**1908**

ముఖ్య సంపాదకుడు :
**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు
**శివలెంక రాధాకృష్ణ**

**ఆంధ్రపత్రిక కార్యాలయము**
**7, తంబుచెట్టి వీథి, మద్రాసు-1**

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : క్రీస్తు జననం
చిత్రకారుడు : గెనిసెట్టి


**కథలు :**

| | |
|---|---|
| చెట్టుక్రింద పీఠరు | — 24 |
| ఆ అమ్మాయి | — 48 |

**సీరియల్ నవలలు:**

| | |
|---|---|
| ప్రేమించు ప్రేమకై | — 16 |
| సురేఖాపరిణయం (కొత్తసీరియల్ ప్రారంభం) | — 32 |
| జీవిత వలయాలు | — 42 |

**వ్యాసాలు, శీర్షికలు, సినిమా:**

ఉత్తరాలు — 2, ఉమెన్ కార్నర్ — 5, న్యాయశిల్పరేఖ — 6, ముగ్గురు మూర్ఖులు — 8, ఒకవారం విపరీతం — 10, 1969 లో మీ రాశి ఫలం—13, ప్రశ్నావళి—15, ధర్మపథం—23, వారఫలం—30, డాక్టర్ కబురు—34, ప్రొఫెసర్ డి. యస్. వాడియా — 39, చిన్నపిల్లల చదువులు—సమస్యలు— 40, క్రిస్మస్ — 47, చిత్రసమీక్ష, సినిమాడైరీ—53, ట్రిక్ ఫోటోగ్రఫీ—54, సినిమా—55, మీకు తెలుసా—58. పుస్తకాలు, ఆటలు—63.



ఆంధ్రప్రదేశ్‌లో ఇలాంటిదే ఒకటి చెయ్యాలి.
కేరళ నక్షలైట్ల తిరుగుబాటు
గాలానికి ఇంకా తగులుకోలేదు



కేరళలో శాంతిభద్రతలు లేవని చెబుతున్నది ఎవరు?
తూగుటుయ్యాల
బన్సీలాల్‌కి హర్యానాలో మెజారిటీతో
హర్యానా రాజకీయాలు
కాంగ్రెస్

# గాంధీ శతజన్మదినోత్సవం: దేశపరిస్థితిలో కొన్ని అంశాలు

భారతదేశంలో మనుష్యులనీ, జంతువులనీ ఎన్నిక ప్రచారం కోసం చక్కగా వినియోగిస్తున్నారు. ప్రచారకులకి ఈ రెండు రకాల జీవులూ బాగా ఉపయోగకరంగా ఉన్నట్లు గమనించవచ్చు. గాంధీ శతజన్మ దినోత్సవాలూ, రాజస్థాన్‌లో నీటి ఎద్దడీ ఇవి రెండూ దీనికి నిదర్శనాలు.

**రెండు సిద్ధాంతాలు**

గాంధీగారు తమ జీవితాన్ని రెండు మూల సిద్ధాంతాలకి అంకితం చేశారు. ఒకటి హిందూ—ముస్లిమ్ అయికమత్యం; రెండు, హరిజనుల ఉద్ధరణ. మద్యపాన నిషేధాన్నీ, ఖద్దరునీ తమ ఆర్థిక కార్యక్రమానికి పునాదులుగా వాడారు, మహాత్మాగాంధీ. ఆయన ప్రార్థన సమావేశాల తర్వాత చేసిన ఉపన్యాసాలని చదివితే గాంధీగారు దుబారా కర్చు అనే ఉన్మాదాన్ని ఎంతగా ఎదిరించేవారో తెలుస్తుంది. కాబినెట్ మంత్రులు తప్ప ఇతర రకాల మంత్రులు ఉండటం ఆయనకి ఇష్టం లేదు.

కాని, ఆయన శత జన్మదినోత్సవ సంవత్సరంలో ప్రభుత్వం ఈ అమిత వ్యయం పిచ్చిలో పడింది. భారతదేశం అంతటా ప్రత్యేకమయిన రయిలు బండి తిరుగుతుందిట. అన్ని చోట్లా మహాత్మాగాంధీ పవిత్ర స్మృతిని తిరిగి వెలిగేట్లు చెయ్యటమే ఈ బండి ప్రయోజనంట. ఈ బండి మీద కర్చు 20 లక్షలు మాత్రమే... ఈ శత జన్మదినోత్సవ సందర్భంలో మత కలహాలు తక్కువగా ఉన్నాయా? లేదు. 1947 తర్వాత 'హిందూ ముస్లిమ్‌ల మధ్య పోట్లాట పెట్టిన దుర్మార్గులు' దేశంలో లేరు. అయినా ఎందుకు ఈ కలహాల సంఖ్య పెరుగుతూ వస్తోంది?

**హరిజనుల సంగతి ఎవరికి కావాలి?**

ఇక హరిజనుల సంగతి. పోనీ, ఆచార్య వినోబాభావే ఒక్కసారయినా పాకీ పనిచేసే వారికి కనీస వేతనాల బోర్డు ఉండాలని అన్నారా? మద్యపాన నిషేధ దేవతకి ముఖ్య పూజారిణి అనదగ్గ డా. సుశీలానయ్యార్ రెండు ప్రభుత్వాలలో ఆరోగ్య శాఖ మంత్రిగా పనిచేశారు. ఆమె, ఆమె సోదరుడు శ్రీ ప్యారేలాల్—ఇద్దరూ మహాత్మాగాంధీ అనుచరుల కిందనే లెక్క. అయితే, ఇద్దరిలో ఒకరయినా పాకీ పని చేసేవారి వేతనాలని నిర్ణయించే 'వేజ్‌బోర్డ్'ని నియమించే ప్రయత్నం చేసినట్లు కనిపించదు. ఇరవయిఒక్క సంవత్సరాలు నిండని ఏ వ్యక్తీ పాకీపని చెయ్యరాదని శాసనం అమలు పరిస్తే సమాజంలో గాఢమయిన మార్పు వస్తుంది.

**కాంగ్రెసులో ఖద్దరు వాడకం...**

ఖద్దరు సంగతి ఇంతే. ఖద్దరు వాడకం కాంగ్రెసువారిలోనే తగ్గిపోతోంది. క్రమంగా మాయం అయ్యేట్లుంది. ఖద్దరుకోసం పెద్ద సబ్సిడీ ఉంది. దీనివల్ల ఎవరికి లాభం? శ్రీ జయసుఖలాల్‌హాథీ ఖద్దరు పనివాళ్ళని గురించి ఎప్పుడయినా ఆలోచించారా? వారికి కనీసవేతనం అంటూ ఉందా? ఉంటే మహాత్మాగాంధీ అనుచరులనేవారికి కర్చు తగులుతుంది. అందుకనే కాబోలు వారు ఈ సంగతిని పట్టించుకోరు. మద్యపాన నిషేధంవల్ల వారికి నష్టం లేదు. దీని కర్చులు భరించేది దేశప్రజలు. (మద్యపాన నిషేధంవల్ల రాబడిలో వచ్చే నష్టాన్ని సగం కేంద్రం భరిస్తుంది)

ఇటీవలే ఒక పెద్దమనిషి ఇంట్లో ఆరు సీసాల విస్కీ పోయాయి. ఈ పెద్దమనిషి ఒక కాంగ్రెసు ప్రముఖుడు. మద్యం పోయిందని ఆయనే ఒప్పుకున్నాడు. ఇంకా పెద్దమనిషికిందే చలామణి అవుతున్నాడు.

డా. సుశీలానయ్యార్ కాంగ్రెసు కమిటీకి ఒక ఉత్తరం రాశారు; రాబోయే కొన్ని రాష్ట్రాల ఎన్నికలలో తాగుడు పనికి రాదనే వారికే కాంగ్రెసు టిక్కెట్లు ఇవ్వాలని ఆమె అన్నారు. ఈ సూచన జరగనిదని కమిటీ తోసివేసింది.

**పాలిసీలమీద రిబేటా?**

మరొక మద్యపాన నిషేధ భిక్షుడు, శ్రీ మొరార్జీదేశాయిగారు, ఆర్థిక శాఖ వారితో తాగనివారికి భీమా పాలిసీలమీద రిబేటు ఇవ్వటం సాధ్యమో కాదో పరిశీలించమన్నారు. ఇది జీవిత భీమాకీ, కారు భీమాకీ కూడా వర్తిస్తుంది.

ప్రస్తుతం జీవితభీమాకి సంబంధించి నంతదాకా ఎల్. ఐ. సి. విధానం ఇలా ఉందని ఆర్థికమంత్రిత్వ శాఖవారు అంటున్నారు—

పాలిసీ తీసుకుందామనుకునేవారు తమకి సారాయి, గంజా, భాంగ్ మొదలయిన మత్తు మందులని తీసుకునే అలవాటు లేదని ప్రమాణం చేస్తూ చెప్పాలిట. వారు చెప్పినదానిలో అసత్యం ఏదయినా ఉంటే పాలిసీ రద్దు అవుతుందిట. తాగుడు అలవాటు ఉండేవారివద్ద ఎక్కువ ప్రిమియమ్‌లు పుచ్చుకుంటారు. బాగా తాగేవారికి అసలే పాలసీలు ఇవ్వరు. వంశపారంపర్యంగా వచ్చే సారాయి అలవాటు గురించి కూడా ప్రత్యేక పరిశోధన చెయ్యటం ఉంటుందిట.

**వాహనమే కాని చోదకుడు కాదు**

అయితే భారతదేశంలో మోటారు భీమా కారుని పట్టిగాని డ్రయివరుని పట్టిచెయ్యరు; అంటే, లయిసెన్సు ఉన్నంత కాలం ఎవరయినా నడపవచ్చునన్న మాట. కాని, భీమా పాలిసీలో కొన్ని షరతులు ఉన్నాయి. తాగి ఉన్న వ్యక్తి కారు నడిపినప్పుడు, వరద, తుఫానుగాలి వల్ల ప్రమాదం ఏర్పడినప్పుడు పూర్తి పరిహారం రాదు.

దీనిని బట్టి మనం గ్రహించవలసినది ఏమిటి? భీమా కంపెనీలు తాగుడును గురించి తగిన జాగ్రత్త తీసుకుంటున్నారు. వైద్యవృత్తి చేస్తున్న డా. నయ్యార్‌కి ఈ విషయం తెలియకపోవటం ఆశ్చర్యకరం. మహారాష్ట్రలో కల్లు విక్రయం మొదలయినిది. (ఇంకెక్కడి ప్రొహిబిషన్?!)

## గోరక్షణ నినాదాలు

అస్సామ్—బెంగాల్‌లలో 45000 పశువులు వరదలలో కొట్టుకుపోయాయని వార్తలు. పశు సంరక్షణ నినాదాలు ఎన్నో వినపడుతున్నాయి. జగద్గురు శ్రీ శంకరాచార్యులు, సేఠ్ గోవిందదాసు, సర్వదళీయ గోరక్ష మహాభియాన్ సమితి, ఇతర మహాత్ములు, దేహపుష్టిగల సాధువులు, సేఠ్‌సాహెబ్, రామ్‌గోపాల్‌షాల్‌వాలాల వెంట తిరిగే జనసంఘం సభ్యులూ — పశు సంరక్షణకోసం ఆ, ఆ ప్రాంతాలు తిరుగుతున్నారని మనం అనుకుంటే— అది మన పొరపాటే అవుతుంది. గ్వాలియర్‌లో శ్రీ జగద్గురువులు హిందూ మహాసభ తొమ్మిదవ సమావేశాన్ని ఆవిష్కరించారు. అక్కడ వారు కుటుంబనియంత్రణాన్ని ఖండించారు సేఠ్ గోవిందదాసుగారు ఢిల్లీలో ఇంగ్లీషు బోర్డులమీద దాడికి 10,000 మందికి పయిగా వాలంటీర్లని సేకరించామని ప్రకటించారు పశ్చిమ బెంగాల్, నాగాలాండు, మదరాసులలో హిందీ వ్యతిరేకం అధికం కాబట్టి అక్కడ ఏదాడీ ఉండదన్నారు సేఠ్‌గారు. ఢిల్లీలో ఆయన స్వంత ప్రచారం కోసం చేసే దాన్నంతా ఉద్యమం కిందజమకట్టుకుంటున్నట్లు సేఠ్‌జీ చెప్పరు.

సేఠ్ రామ్‌గోపాల్‌షాల్‌వాలా లోకసభలో రెండు ప్రశ్నలు అడిగారు:—

I ప్ర: ఆరోగ్య, కుటుంబనియంత్రణ, నగరాభివృద్ధిశాఖ మంత్రిగారు

అ) ఢిల్లీ ఎలెక్ట్రిక్ దహనశాలమీద ఏటా రు 1,60,000 కర్చుపెడుతున్నదీ లేనిదీ చెప్పగలరా?

ఆ) శవాలమీద ఈ దహనశాల ఆదాయం సాలుకి రు. 10,000 మాత్రమే అవునో కాదో చెప్పగలరా?

ఇ) అయినట్లయితే రు 1 50,000 నష్టం భర్తీ చెయ్యటానికి ప్రభుత్వం దహనశాలని మూసివెయ్యదో లేదో చెప్పగలరా?

ఈ) మూసివెయ్యటానికి అడ్డు ఏమిటో వివరించగలరా?

ఈ ప్రశ్నలకి సమాధానాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి—

అ) తనిఖీ చెయ్యగా జరిగిన కర్చు రు 80,000 (సాలుకి) మాత్రమేనని తెలుస్తున్నది.

ఆ), అవును (రు.10,000 మాత్రమే) (ఇ, ఈ). మునిసిపల్ కార్పొరేషన్‌ని దహనశాల వ్యవహారాలని జాగ్రత్తగా పరిశీలించమని అడుగుతాము.

II ప్రశ్న: మంత్రిగారు ఇంకా ఈ క్రింది ప్రశ్నలకి సమాధానం చెప్పగలరా?

అ) రాజధానిలోని శ్రీనివాసపురిలోని ఆర్యసమాజం దేవాలయాన్ని ఢిల్లీ పరిపాలనవారు ధ్వంసంచేశారా?

ఆ) ముందుగా ఎందుకు చెప్పవలసిన వారికి చెప్పలేదు?

సమాధానాలు—

అ) శ్రీనివాసపురిలోని జె జె. కాలనీలో అధికారుల అనుమతిలేకుండా ఆర్యసమాజ మందిరాన్ని కట్టగా దానిని పడగొట్టడం జరిగింది.

ఆ) ఇటువంటి సందర్భంలో ముందుగా చెప్పవసరంలేదు.

సేఠ్ రామగోపాల్ షాల్‌వాలా ఢిల్లీ నుంచి లోక్‌సభకి ఎన్నిక అయ్యారు. వారి పార్టీ జనసంఘమే మున్సిపల్ కార్పొరేషన్‌ని పరిపాలిస్తోంది. దహనశాల మీద ప్రజల డబ్బు దండగ చెయ్యటం సేఠ్‌గారికి ఇష్టంలేదు బాగానే ఉంది. కాని, ఆర్యసమాజమందిరం అనుమతిలేకుండా కట్టారుకదా?

సేఠ్ రామ్‌గోపాల్ తమ ఎన్నికని గోమాత పేరు చెప్పుకుని గెలిచారు. పాత ఢిల్లీలో ఆవుల పరిస్థితి ఎలా ఉందో మాత్రం అందరికీ తెలుసు.

### బీహారు పశువులని రక్షించినదెవరు?

రెండేళ్ళకింద కడుపునిండా తిన్న సాధువులు గోహత్య నిషేధం కోసం మ్యాఢిల్లీ వీధులలో గంతులు వేస్తున్నప్పుడు బీహారు పశువులని గొడ్డుమాంసం తినే పాశ్చాత్యులే రక్షించారు.

రాజస్థాన్‌లో పరిస్థితి అలాగే ఉంది. అక్కడి పశువుల రక్షణకోసం లండన్ లోనూ ఇతర ప్రదేశాలలోనూ ప్రయత్నాలు జరుగుతున్నాయి. సేఠ్ గోవిందదాసు హిందీ అల్లరి లేవదీస్తామంటున్నారు; సేఠ్ షాల్‌వాలా దహనశాలగురించి ఆందోళన చెందుతున్నారు. జగద్గురువులుసర్కార్‌కమిటీవివాదవత్తిడి తీసుకువస్తున్నారు. —శ్రీకృష్ణ



మద్రాసు ప్రసిద్ధ తమిళ చలన చిత్ర నటుడు ... బిర్లా క్రిష్ణం ... యూనియన్‌వారి "దేశోద్ధారక భవన" నిధికి ఐదువేలరూపాయల నగదు మొత్తాన్ని యూనియన్ కార్యదర్శికి విరాళంగా అందజేసినప్పటి ఫోటో. (మూడవవ్యక్తి ఎం. జి. ఆర్. సెక్యూరిటీ ఆఫీసర్) ఈనెల 8వ తేదీనాడు శ్రీ ఎం. జి. ఆర్. హైదరాబాద్‌లో రవీంద్రభవనంలో ఫిలిం క్రిటిక్స్ అసోసియేషన్‌వారి ఇష్టాగోష్ఠి సమావేశానికి హాజరైనప్పుడు అయ్యాచితంగా విరాళాన్ని ప్రకటించి అక్కడికక్కడ అందజేశారు.

# ముసురు మూర్ఖులు వీరబలుడు




'వీరబలుడు అంటూ యేదో నవ్వు చెప్పబోయావు ఏమిటది?' అని ప్రశ్నించాడు చంచలావు.

'వో! అదా! అంటూ చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

అక్బరు చక్రవర్తి ఆస్థానంలో వీరబలుడు ఉండేవాడు. వీరబలునివద్ద హాస్యం, సమయస్ఫూర్తి పుష్కలంగా ఉండేయి. 'ప్రపంచం అంతట్లోకి బుద్ధిహీనులయిన నలుగురు వ్యక్తులను తీసికొని రావలసినదిగా ఒకప్పుడు అక్బరు వీరబలునికి ఆజ్ఞ యిచ్చాడు. బుద్ధిహీనులను వెదకడానికి కొంత కాలం పడుతుందని వీరబలుడు అక్బరుకు మనవి చేశాడు. అక్బరు పదిరోజులు గడువు యిచ్చాడు.

వెంటనే వీరబలుడు బుద్ధిహీనులను వెదకడం ప్రారంభించాడు. పదిరోజులు గడువు పూర్తి అయేసరికి యిద్దరు బుద్ధిహీనులనుమాత్రం వీరబలుడు పట్టుకోగలిగాడు. మిగిలిన యిద్దరు బుద్ధిహీనులన్ను గురించి అక్బరు అడిగితే, ఏదో ఒక యుక్తి వలన తప్పించుకొందామనుకొన్నాడు వీరబలుడు.

తాను పట్టుకొన్న యిద్దరు బుద్ధిహీనులను అక్బరు కొలువులోనికి తీసికొని వచ్చాడు వీరబలుడు.

'వాళ్ళు బుద్ధిహీనులని యెలాగ నిర్ణయించావు?' అని ప్రశ్నించాడు అక్బరు.

'ప్రభూ! యీ మొదటి ఆసామీ గుర్రంమీద స్వారీ చేస్తుండగా నేను చూశాను. అప్పుడు అతని నెత్తిమీద గడ్డిమోపు ఉంది.' గడ్డిమోపు నీ నెత్తిమీద పెట్టుకోవడం యెందుకు? గుర్రంమీద పెట్టవచ్చునుగదా!' అని నేను అన్నాను.

'అయ్యా! యిది అసలే ఆడగుర్రం. అందులోనూ యిప్పుడు కడుపుతో ఉంది. అందుచేత నా బరువే కాకుండా గడ్డిమోపు బరువును కూడా యిది మోస్తే దీనికి ఆయాసం వస్తుంది. కాబట్టి గడ్డిమోపు బరువును నేను మోస్తున్నాను' అని యితను నాకు సమాధానం యిచ్చాడు. అందుచేత యితనొక బుద్ధిహీనుడని నేను నిర్ణయించాను' అని వీరబలుడు సమాధానం యిచ్చాడు.

'ఇది బాగానే ఉంది. రెండవ ఆసామీ సంగతి యేమిటి?' అని అక్బరు ప్రశ్నించాడు.

'ప్రభూ! యితను బజార్లో అందరికీ మిఠాయి పంచి పెడుతున్నాడు. 'మిఠాయి ఎందుకు పంచి పెడుతున్నావు?' అని నేను యితన్ని ప్రశ్నించాను.

'బాబూ! మూడు సంవత్సరాల క్రిందట నా భార్య యింకొకడితో లేచిపోయింది. దానికి యిప్పుడు మొలెత్తింది. ఆ సంతోషంకొద్దీ నేను అందరికీ మిఠాయి పంచిపెడుతున్నాను' అని యితను నాకు సమాధానం యిచ్చాడు. అందుచేత యితను బుద్ధిహీనుడని నేను నిర్ణయించాను' అని వీరబలుడు అక్బరు చక్రవర్తికి చెప్పాడు.

'సరే! బాగానే ఉంది. నేను నలుగురు బుద్ధిహీనులను తీసికొని రమ్మనమని చెప్పినుగాని నువ్వు యిద్దరు బుద్ధిహీనులనుమాత్రం తీసికొనివచ్చావు. మిగిలిన యిద్దరు బుద్ధిహీనులు యెక్కడ ఉన్నారు.' అని ప్రశ్నించాడు అక్బరు.

'ప్రభూ! మిగిలిన యిద్దరు బుద్ధిహీనులు కూడా యిక్కడే ఉన్నారు. బుద్ధిహీనులను వెదకడంలో పది రోజుల కాలాన్ని వ్యర్థం చేసిన నేను ఒక బుద్ధిహీనుణ్ని. యీ పనిలో నియమించిన మీరు ఒక బుద్ధిహీనులు' అని వీరబలుడు సమాధానం యిచ్చాడు. అక్బరు ఆ సమాధానం విని చిరునవ్వు నవ్వి పూరుకున్నాడు'అని చూడామణి వీరబలుని కథ పూర్తి చేశాడు.

'వీరబలుని కథ బాగానే ఉంది. కాని అకస్మాత్తుగా నీకు యెందుకు యీకథ గుర్తుకు వచ్చింది?' అని ప్రశ్నించాడు చిదంబరం.

'వీరబలునికి యిద్దరు బుద్ధిహీనులు మాత్రమే దొరికారు. మిగిలిన యిద్దరూ దొరకక పోవడంవల్లనే కదా, అతను తన యుక్తిని ప్రదర్శించ వలసివచ్చింది. ఇప్పుడైతే మిగిలిన యిద్దరు బుద్ధిహీనులు కూడా వీరబలునికి దొరికేవారు కదా'అని నేను అనుకొన్నాను.'

'ఎవరా యిద్దరు బుద్ధిహీనులు?'

ఒకటి మనను పరిపాలిస్తున్న భారత ప్రభుత్వం వారు'అని సమాధానం యిచ్చాడు చూడామణి.

'భారత ప్రభుత్వం యొక్క బుద్ధిహీనతను ఎలాగ రుజువు చేయగలవు?'అని చంచలావు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'1968 నవంబరు నెలలో, లోక్‌సభలో ప్రశ్నోత్తరాల సమయంలో భారతప్రభుత్వపు ఉపప్రధాన మంత్రి, ఆర్థిక మంత్రి అయిన మొరార్జీదేశాయి. కొన్ని వివరాలను వెల్లడించాడు.

'24—8—1964వ తేదీని,4—9—1964వ తేదీని యిన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటు సినిమా నటి వైజయంతీమాల యింటిని సోదా చేసింది. ఆ సందర్భంలో 385 గ్రాముల బంగారం, కొంత విదేశీద్రవ్యం బయటపడ్డాయి. అంతేకాకుండా రూ 1,11,615లను దాచి వేసినట్లుగా ఆమె వెల్లడించింది. తరువాత ఆమె దానిమీద యిన్‌కమ్‌టాక్సును చెల్లించి వేసింది.

ఆ బంగారాన్ని కలిగి ఉండడం గోల్డు కంట్రోలు రూల్సుకు వ్యతిరేకం. విదేశీ ద్రవ్యాన్ని దాచడం, యిన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటుకు సరియైన లెక్కలను యివ్వక పోవడం యివి నేరాలేకదా! అయినా భారత ప్రభుత్వం వారు 1968 సంవత్సరంలో ఆమెకు పద్మశ్రీ అవార్డును యిచ్చారు.

ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నును యెగగొట్టడం, చట్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం



యివి ప్రభుత్వాన్ని మోసం చెయడం కాధా? అలాగ మోసం చేయడానికి ప్రయత్నించిన వ్యక్తికే ప్రభుత్వం 'పద్మశ్రీ' అవార్డును యిచ్చి సత్కరించిందంటే ప్రభుత్వం యెంత బుద్ధిహీనంగా వ్యవహరిస్తుందో నేను వేరే చెప్పాలా?' అని తిరిగి ప్రశ్నించాడు చూడామణి.

'సరే, యింకొక బుద్ధిహీనులెవరు?'అని ప్రశ్నించాడు చిదంబరం.

'పెద్ద సినిమా నటులకు సన్మానాలు చేసేవారు'

సినిమా నటులకు సన్మానాలు చేసేవారు బుద్ధిహీనులని యెలాగ చెప్పగలవు?' చంద్రావు ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'పెద్ద సినిమా నటుల్లో చాలామంది బ్లాక్‌మనీ తీసికొంటారని పేపర్లలో వ్రాస్తూ ఉంటారు' మాలాసిన్హా, రాజకపూర్ మొదలైనవారి యిండ




మీద యిన్‌కమ్‌టాక్సు డిపార్టుమెంటువారు దాడి చేసినప్పుడు కొంత 'బ్లాక్‌మనీ' దొరికిందని ప్రభుత్వం వారే ప్రకటించారు.

'అంటే యీ బ్లాక్‌మనీ తీసికొనే నటులు ప్రభుత్వాన్ని మోసం చేస్తున్నారన్న మాట. ప్రభుత్వాన్ని మోసం చేయడం అంటే ప్రజలను కూడా మోసం చేస్తున్నట్లేకదా!'

'ప్రభుత్వం దగ్గర డబ్బుఉంటే, రోడ్లు వెయ్యడం, ప్రాజెక్టులు కట్టడం వంటి ప్రజలకు ఉపయోగపడే పనులను చేస్తుంది. ప్రభుత్వానికి చెల్లించవలసిన పన్నును యెగగొట్టడం అంటే ప్రజాహిత కార్యక్రమాలను కుంటుపరచడమేకదా!'

'ప్రభుత్వానికి తద్వారా ప్రజలకు చెందవలసిన డబ్బును అపహరిస్తున్న యీ పెద్ద సినిమానటులకు సన్మానాలు చేసే ప్రజలు, బిరుదులను యిచ్చే ప్రజలు బుద్ధిహీనులని నేను వేరే చెప్పనక్కర లేదు ప్రజలు, తమను మోసం చేస్తున్న సినిమా నటులకే తాము సన్మానం చేయడం ప్రజల బుద్ధిహీనతను తెలియజేయడం లేదా?' అని చూడామణి ప్రశ్నించాడు.

'మబ్బులు పట్టాయి. వర్షంవచ్చే లాగఉంది' అంటూ చిదంబరం లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు. ●

# పురుషుడుగా మారిన స్త్రీ

ఇడైపాడి (సేలం) అనే గ్రామానికి చెందిన శివభాగ్యం అనే ఆమె పురుషుడుగా మారిపోయిందట. శివభాగ్యానికి 1956 లో వివాహమయ్యిందట. భర్తతో ఒక ఆరు నెలలు కాపరం చేశాక, ఆమెకు భర్త పొందు మీద, దాంపత్య జీవితం మీద విముఖత ఏర్పడిందట. రెండు సంవత్సరాలు ఆమె మార్పులేని వైఖరి చూసి, భర్త సుబ్రహ్మణ్యం ఆమెకు విడాకులిచ్చి, మరో పెళ్ళి చేసుకున్నాడట. శివభాగ్యం పుట్టింటికి చేరిందట 1958 లో. కొన్నాళ్ళకి ఆమెకు ఋతుక్రమం జరగడం మానేసిందట. తల్లి యీ విషయం విని ఆశ్చర్యపోయినా, కూతురు గాభరా పడక, ప్రశాంతంగా వుండడం వల్ల ఆమె వూరుకుందట. మరికొన్నాళ్ళకి గొంతు స్వరంలో మార్పు వచ్చి క్రమంగా పురుష కంఠస్వరం వంటి స్వరం వచ్చిందట. గొంతు బొంగురు పోయిందేమో అనుకుందామంటే ఆ గొంతు అలానే వుండిపోవడమే గాక, మెల్ల మెల్లగా మీసం, గడ్డం మొలవ నారంభించిందట. శివభాగ్యం తనలోని మార్పులను చాలా జాగ్రత్తతో గుట్టుగానే వుంచుకుందట. చివరికి స్త్రీ అవయవాలు సంపూర్ణంగా హరించుకుపోయి, పురుషావయవాలు వచ్చేశాయట. ఈ ప్రక్రియ జరగడానికి దాదాపు పది సంవత్సరాలు పట్టిందట. శివభాగ్యం సంపూర్ణంగా మగవాడయిన విషయం మొదట తల్లికి, ఆనక తండ్రికి, ఆ వెనుక వూరూ వాడా అంతా వ్యాపించింది. గ్రామ పెద్దలంతా చేరి యీమెకు "శివపెరుమాళ్" అనే పేరు నామకరణం చేశారట. పొడుగాటి జుట్టును ఓ మంగలి వచ్చి క్రాపుగా మార్చేశాడట. లుంగీ పంచ, గావంచా, చొక్కా ధరించి, యీ శివభాగ్యం—శివపెరుమాళ్ళయిపోయిందట. ఇప్పుడు శివపెరుమాళ్, తన పెళ్ళికి తలిదండ్రులను తొందర చేస్తున్నాడట. "చక్కని సౌందర్యవతి, అనుకూలవతి అయిన ఓ అమ్మాయిని పెళ్లి చేసుకుని, హాయిగా కాపరం చేస్తాను" అందట / అన్నాడట.






ఈ విషయం మీద యింకా అనుమానం వున్నవారు, ఆసక్తి వున్నవారూ, ఆశక్తి (డబ్బు) వున్నవారూ సేలం జిల్లాకి చెందిన ఇడైపాడి వెళ్ళి వేడుకగా చూసి రావచ్చు—యస్సార్!

# దుర్భర దారిద్ర్యం

పేదరికం భరించరానిది. కోయంబత్తూరుకు 30 మైళ్ళ దూరంలో వున్న పెరుపాళాయం, గ్రామంలో దుర్భర దారిద్ర్యానికి ఎదురీద లేక, విషం కలిపిన కాఫీ తన పిల్లలకు పట్టించి, తనూ, తాగేసిందట ఒకతల్లి. మొత్తం నలుగురూ చనిపోయారు. విషం కాఫీ యిచ్చే సమయానికి ఆఖరు పిల్ల బయట ఆడుకుంటున్నందు వల్ల ఆమె మాత్రం బ్రతికి బయటపడిందట.

# రెండు సార్లు పెళ్లి

ఫాల్ రివర్ (మేసాచుసెట్స్) నుంచి భారతదేశం వచ్చిన క్లాడియెట్ కొషియా చివి అనే ఆమె రవి కుల కర్ణి అనే అతన్ని ప్రేమించి, తన దేశానికి తీసుకు పోతానంటే హిందూదేశం తత్ అందట. ఆదేశం తుత్ అందట. దాంతో ఆమె అతన్నిక్కడో సారి పెళ్ళి చేసుకుని, ఆనక మేసాచుసెట్స్‌లో రోమన్ కాథలిక్ సాంప్రదాయం ప్రకారం మరోసారి పెళ్ళి చేసుకుందట. దానితో అతనిపోక— రాకలను రెండు దేశాలూ ఆమోదించాయట— రూల్సంటే రూల్సే!

* * *

# పరీక్ష తప్పిన అమ్మాయి ఆత్మహత్య

విజయవాడ ఎస్సారండ్ సీవీ ఆర్ ప్రభుత్వ కళాశాలలో బియస్సి చదువుతున్న కుమారి తురగా సావిత్రి (19 ఏళ్ళట.) అనే ఆమె గత ఏప్రియల్ లోనే గాక మొన్న అక్టోబరులో కూడా ఇంగ్లీషు పరీక్ష తప్పినందువల్ల కృష్ణలో దూకి, ఆత్మహత్య చేసుకుందట. ఆమె శవం హైదరాబాదు రోడ్డు సమీపంలో పడవల రేవు వద్ద దొరికిందట. "జాతస్యః ధ్రువోమృత్యుః" అని గీత బోధించినా యీ రకం మరణాలు తలిదండ్రులు తట్టుకోగలరా!




* * *

కిళియమ్మాళ్ అనే విధవ తన మేనమామ కొడుకు (బావ) చిన్నసామి అనే అతన్ని ప్రేమించి అతనికి ఆశలు కలిగించి, చివరికి జయరామన్ అనే అతన్ని పెళ్లి చేసుకుందట. కాన్పుకు పుట్టింటికి వచ్చిన ఆమెను చిన్నసామి కత్తితో పొడిచి చంపి, అడ్డం వచ్చిన జయరామన్నీ పొడిచాడట. "మగాడివయితే నా చీర యిస్తాను— దానితో ఉరి పోసుకు చావు" అని కిళియమ్మాళ్ అనే సరికి ఆవేశంతో అతనీపని చేశాడట. వేలూరు సెషన్సు కోర్టులో ఇతనికి—కత్తితో పొడిచినందుకు మూడు నెలలు కారాగారశిక్ష, హత్య చేసినందుకు మరణ దండన విధించారట.

* * *

## రాష్ట్రకేంద్రంలో ఉంటే...

తిరుపతి వెంకటేశ్వరుని గుడికి రద్దీ చాలా ఎక్కువగా వుందనీ, కనుక ఈ భగవంతుని దర్శనం టెలివిజనులో చూపిస్తే కొంత రద్దీ తగ్గవచ్చనీ ప్రభుత్వం ఆలోచిస్తోంది. అయ్యా తిరుపతి వెళ్లేవరు అంతకుముందు తిరుపతి వెంకటేశ్వర్లు దర్శనం చేసుకోనివారేనా! వీరిళ్ళల్లో స్వామిపటాలు లేవూ! మరెందుకు —మళ్ళీ మళ్ళీ వెళ్తారు? అలా వెళ్ళేవారిని యీ టెలివిజన్లు ఆపగలవా? ఇంకా నయం రాష్ట్ర కేంద్రంలో వుంటే నాలుగురూ చూడవచ్చుని ఆ దేవాలయాన్నో లేక స్వామినో హైదరాబాదు తరలించే ఆలోచనలు రాలేదు. 12 సంవత్సరాలు నంచీ దొంగతనాల చేస్తున్న ఆడ దొంగల గ్యాంగులో ఒక నలుగుర్ని పట్టుకుని విజయవాడకు తీసుకువచ్చారు. రైళ్ళల్లో— ముఖ్యంగా ప్యాసింజరు బండ్లలో వున్న జనానికి నమ్మిక కలిగేలా ప్రవర్తించి, వారు నిద్రపోతున్న సమయంలో విలువైన వటిని లాక్కుపోడమట వీరి పని. ఈ గ్యాంగులో 11 ఏళ్ళ నుంచి 40 ఏళ్ళ వరకూ స్త్రీలున్నారట. కమలమ్మ, పుష్పవళ్ళి అనే 35 ఏళ్ళు దాటిన వారినీ, సరస అనే 11 ఏళ్ళ అమ్మాయినీ పట్టుకున్నారటిప్పటికి. బీడీలు

## హైద్రాబాద్కి..! భలే ఐడియా..!



చేయడానికి కావలసిన ఆకు సాలీనా 80 లక్షల పైగా విలువ చేసే 7 వేల టన్నులు మనదేశం పరాయి దేశాలకు ఎగుమతి చేస్తోందట. భళిభళి.

**25 అడుగుల పొడవు 2 మీటర్ల బరువు వున్న**

ఒక మహాసర్పాన్ని ఖాట్మండులో యిద్దరు గ్రామస్థులు పట్టుకొన్నారట. ఆంధ్రలో 19 జిల్లాల కలెక్టర్ల నివాస భవనాలున్న మొత్తం జాగా ఎంతో తెలుసా—145 ఎకరాలట.

* * *

హిందూదేశంలో ఎక్కువ కాలం బ్రతికే ఆడవారిలో కేరళ, పంజాబ్ రాష్ట్రాలది అగ్రస్థానమట. కేరళ ఆడవారి సరాసరి వయస్సు 57, అయితే, పంజాబ్ లెక్క 59ట. మద్రాసు 50కి బీహారు 49 అయితే ఆంధ్ర నలభై ఎనిమిదేనట— ఇంతేనా!

## హత్యా-ఆత్మహత్యా

అన్నం పెట్టమంటే పెట్టను పొమ్మనడమేగాక హీనంగా మాట్లాడిందని విశ్వనాథన్ అనే అతను తన అన్నకూతురు శివకామి అనే ఆమెను కత్తితో పొడిచి చంపేశాడట. ఆనక అదే కత్తితో తనూ పొడుచుకున్నాడట. అతను ఆసుపత్రిలో కోలుకుంటున్నాడట. ఇది మద్రాసు షైట్‌పట్‌లో జరిగింది.

* * *

## సొంత ప్రదేశాలలో స్వేచ్ఛ!

అమెరికాలోని హాలీవుడ్ ప్రాంతంలో వున్న జల్సియమ్ ఫిల్డ్సు అనే చోట ఇరవై ఇద్దరు మంది వింటిమీద ఓ సెంటిమీటరు బట్టయినా లేకుండా హాయిగా నగ్నంగా వున్నారని ఆ చుట్టుపక్కలవారు కేసు పెట్టారట. మేజిస్ట్రేటు కోర్టు, సెషన్సు కోర్టు వీరికి అపరాధం విధించిందట. కాని యీ యిరవై రెండుమందీ హైకోర్టుకు అప్పీలు చేసుకుంటే "ఎవరి సొంత ప్రదేశాలలో వారు యథేచ్ఛగావుండవచ్చు. కనుక నగ్నంగా వుండడం నేరంకాదు" లెట్ దెమ్ కంటిన్యూ" అందట కోర్టు. ఎదటివారికి కష్టనష్టాలు కలగని పద్ధతిలో తన సొంత ప్రదేశంలో ఇష్టానుసారంగా వుండడం నేరంకాదు—యస్. అలాని అంతా యీ సూత్రాన్నే పాటిస్తే..... కాన్ యిమాజిన్......యూసీ.

## ఆడ దొంగలు

కాళి అనే ఆమె బెంగుళూరులో చిల్లర జేబు దొంగతనాలు చేసి, కొంత ప్రతిభ సంపాదించి, ఆనక బొంబాయి వెళ్ళి మరికొన్ని దొంగతనాలు చేసి అదయ్యాక "ఆడ దొంగతనాల గ్రూపులో" చేరి, రెండు చేతులా సంపాదించి బెంగుళూరులో నాలుగు మేడలూ, కొన్ని భూములు కొనుక్కొని స్థిరపడి పోయిందట. ఈమె వున్నట్టుండి యింత ధనికురాలు ఎలా అయ్యింది అని పోలీసు తీసిన ఆరాల్లో డొంకంతా కదిలి దొంగల గ్రూపు (స్త్రీలు మాత్రమే) బయట పడిందట. 11 ఏళ్ళనుంచి 40 ఏళ్ళవరకూ వయసున్న స్త్రీలు యిందులో వున్నారట. పాసింజరు బండ్లల్లో మూడవతరగతి పెట్టెలలో ఎక్కే ప్రయాణీకులను ఏమార్చి, వారి సామానులు ఎత్తుకుని పోవడమే వీరి కర్తవ్యమట!




## ఒకవారం విపరీతం

ఢాబా నగరంలోనడిబజారులో ఒకవ్యక్తిని నానా రకాలైన ఆయుధాలతోను కొట్టి పదకొండు మంది చంపేశారట. చూపరులలో ఎవరూ ధైర్యం చేసి ఆపదకొండుమందినీ వారించలేక పోయారట. ఆ హత్య చేసినవారు హాయిగా వెళ్ళిపోయాక పోలీసులు వచ్చి పరిశోధన ప్రారంభించారట.

## న్యాయానికి అందరూ ఒక్కటే

మనన్ దోడి (ఉత్తరమైనాడ్)లో ఒకామె తన భర్తను నేరుగా పోలీసులకు వప్పగించి, "నేరం ఎవరు చేసినా కఠినంగా శిక్షించాల్సిందే" అందట.




భర్త గోపీనాథన్ ప్రముఖ ఉగ్రవాదట. పల్లి వైర్‌లెస్ కేంద్రం మీద జరిపిన దాడిలో యీయన కూడా వున్నారేమో అనే అనుమానమట.

* * *

గత జూలైలో భీమవరంలో హరిజన బాలుణ్ణి సజీవదహనం చేసిన వైనంమీద రాష్ట్ర శాసన మండలిలో వాదోపవాదాలాడుకుంటున్నారు. దొంగతనం చేసిన నేరానికి ఆ వ్యక్తిని రైల్వే భద్రతాదళం వారు ఒక గదిలో బంధించి, ఇనప వూచలతో కొట్టారనీ, దాహం దాహం అని అరుస్తే ఒక్క ఉద్ధరిణెడు మంచినీళ్ళయినా యివ్వలేదని, ఆనక కిరసనాయిలు మీదపోసి, నిప్పు ముట్టించారనీ— అన్నవార్తసరి కాదనీ, బాధలు భరించలేక, పక్కనున్న కిరసనాయిల్లు మీద పోసుకుని తనే నిప్పంటించుకున్నాడనీ అంటున్నారు. అది సరిబాబూ. అతన్ని బంధించిన చోట చేతి కందేలా వో కిరసనాయిలు టిన్ను, పక్కన ఓ అగ్గిపెట్టె (ఆగదిలో) ఎందుకువుండాలి? కిమర్థం!

* * *




## పెళ్ళికి లాటరీ

క్వెట్టా అనే చోట ఇద్దరు యువకులు ఒకే అమ్మాయిని ప్రేమించారట. ఇద్దరూ ఆమె యింటికి ఒకేసారి వచ్చారట. ఇద్దరి వెనకా చెరో పటాలం వుందట. ఆమె నాదంటే నాదనుకున్నారట. యుద్ధం ప్రారంభం అవబోతుండగా ఆమె తండ్రి పరుగునా వచ్చి 'శాంతి శాంతి' అని దానికోమార్గం సూచించాడట. ఇద్దరి యువకుల పేర్లు రెండు చీటీల మీద రాసి ఓ చిన్నపిల్ల చేత తీయించితే, ఎవరిపేరువస్తే వారే మా అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలి అన్నాడట. వారు సమ్మతించారట. లాటరీలో తాజ్‌దిన్ అనే యువకుడు ఘనవిజయాన్ని సాధించాడట. ఔరంగజేబు ఓడిపోయాడట. ఇంతకీ ఆమె ఎవర్ని ప్రేమించింది? ఎవర్నయినా ఫరవాలేదని అనుకుందో! మంచి పాలసీయే!! ఆల్ ఫ్లాష మాడరన్ లవ్.

## హత్యా - హఠాన్మరణమా?

మద్రాసు నుంగంబాకంలోని "ధైర్యంక్లినిక్" లో పనిచేస్తున్న డాక్టర్ సుబ్బయ్య అనే ఆయన తన గదిలో చనిపోయి వున్నారట. (డిశంబరు 9) ఇది చావు (అకాలమరణం) కాదని, ఆత్మహత్యకాదనీ, ఎవరో పీకనులిమి చంపి వుండాలని అనుమానిస్తున్నారు.

## నరరూప రాక్షసుడు

సూరత్‌లో ఒకాయనకు గర్భిణి అయిన తన భార్యమీద కోపం వచ్చి సజీవంగా ఆమెను తగలేశాడట. కాలిపోతున్న తల్లిని చూసి ఆరేళ్ళ కూతరూ, మూడేళ్ళకొడుకూ తల్లిని చేరి వారూ ఆ మంటలలో బూడిదై పోయారట. ఈ నరరూపరాక్షసుడు గారిని 3వ తేదీన అరెస్టు చేశారట.

# 1969లో మీ రాశిఫలం!

## 7. తుల

ప్రతి సంవత్సరం సెప్టెంబరు 23 వ తేదీ నుంచి అక్టోబరు 22వ తేదీ వరకు సాయనసూర్యుడు తులారాశియందు ఉంటాడు. కాబట్టి యీ తేదీల మధ్య జన్మించిన వారు, తులా రాశి యందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు.

తులారాశియందు జన్మించినవారికి యీ సంవత్సరం ప్రారంభంలో సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో పెద్ద మార్పులు చేయుడానికి యిది సమయంకాదు. కుటుంబ వ్యవహారాల్లో యితరుల మూలంగా చికాకులు యేర్పడి తరువాత సర్దుకుంటాయి.

ఉద్యోగన్వేషకులకు సంవత్సరం మధ్యలో ఉద్యోగ ప్రాప్తి కలుగుతుంది. అవివాహితుల వివాహ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యార్థులు కొంచెం శ్రమ మీద కృతార్థులు కాగలరు.

**జనవరి**

ఈ నెలలో మీకార్యక్రమాలకు కొద్ది మార్పులు వస్తాయి. వృత్తి వ్యాపారాల్లో శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాంఘిక వ్యవహారాల్లో నూతన గౌరవాన్ని పొందగలరు. ప్రయాణం ద్వారా కార్య సాధన చేయగలరు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**ఫిబ్రవరి**

ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాల వల్ల, ముందుముందు కూడా ప్రయోజనం ఉంటుంది. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు రాగలవు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి. అలంకార వస్తువులు కొంటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మార్చి**

వృత్తి వ్యాపారాల్లో కొత్తవారితో పోటీ యేర్పడుతుంది. ఆర్థికంగా మీస్వంత వ్యవహారాలు బాగానే ఉన్నా, యితరుల నిమిత్తం శ్రమకు గురి కాగలరు. ఉద్యోగంలో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వచ్చి సర్దుకొంటాయి. అధికవ్యయం జరుగుతుంది.

**ఏప్రిల్**

కొంతమంది మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం వలన కార్యభారం పెరిగినా, తుదకు అనుకూలతను సాధించగలరు. వృత్తి రీత్యా దూర ప్రయాణాలు చేయవలసి వస్తుంది. భారీయెత్తున చేసే వ్యాపారాల బాగా ఉంటాయి. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

**మే**

ఇంతవరకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లోనే కొత్త సమస్యలు తలయెత్త గలవు. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలి వేయడం మంచిది. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. ఆందోళన కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

**జూన్**

వృత్తి వ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు క్రమంగా తగ్గుతాయి. నూతన వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణిస్తుంది.

**జూలై**

మీ కంటే పెద్దవారు కూడా కొన్ని వ్యవహారాల్లో మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. వ్యాపారంలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు. దైవకార్యాలు నెరవేరుతాయి.

**ఆగస్టు**

భవిష్యత్తులో మీకు ఉపయోగించే వ్యవహారాల్లో చొరవ చూపించవలసిన సమయం. వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. అలంకార వస్తువులు కొంటారు.

**సెప్టెంబరు**

వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. అధికవ్యయం జరగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. బంధువుల వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. దూరప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

**అక్టోబరు**

ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ కృషిని అధికారులు గుర్తించగలరు. పుణ్యకార్యాలు చేస్తారు. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి.

**నవంబరు**

ఈ నెలలో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఇదివరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు యిప్పుడు చేతికి రాగలదు. నూతన వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలకు అనుగుణమైన సంఘటనలు జరుగుతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**డిసెంబరు**

వృత్తిలో సాటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. వ్యాపారవిస్తర్



ప్రయత్నాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

## 8. వృశ్చికం

ప్రతి సంవత్సరం అక్టోబరు 23 వ తేదీ నుంచి నవంబరు 21 వ తేదీ వరకు సాయనసూర్యుడు వృశ్చిక రాశియందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించినవారు వృశ్చికరాశియందు జన్మించిన వారుగా పరిగణింపబడుతున్నారు.

వృశ్చిక రాశియందు జన్మించిన వారికి యీ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. ఏ వ్యవహారంలోను విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశం లేదు. వృత్తి వ్యాపారాల్లో శ్రమ మీద స్వల్పాభివృద్ధిని సాధించగలరు.

ఉద్యోగాన్వేషకులకు యెన్నో అవకాశాలు కన్పిస్తాయి గాని అవి కార్యరూపాన్ని ధరించడం కష్టం. అవివాహితుల వివాహ ప్రయత్నాల్లో ఆటంకాలు యేర్పడి సర్దుకొంటాయి. విద్యార్థులు మొదటి నుంచీ శ్రద్ధగా చదవడం అవసరం.

### జనవరి

వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. వృత్తిలో సాటివారి పోటీని యెదుర్కొని అభివృద్ధిని సాధించగలరు. ఉద్యోగంలో మీరు యిదివరకు చేసిన నిర్ణయాలు సరియైనవని రుజువు కాగలవు. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి.

### ఫిబ్రవరి

వృత్తి వ్యాపారాల్లో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. మీస్వంత పనులు సులువుగానే నెరవేరుతాయి గాని యితరుల నిమిత్తం మీరు శ్రమ పొందవలసి వస్తుంది. సాహిత్య కళారంగాల్లో, మీ కృషికి స్వల్పాటంకాలు వస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. బంధువుల వ్యవహారాల్లో జోక్యం చేసికోవలసి వస్తుంది.

## ... మీ రాశిఫలం

### మార్చి

భవిష్యత్తులో మీకు ఉపయోగించ గల వ్యవహారాల్లో చొరవ చూపించవలసిన సమయం. ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. విలువైన వస్తువులు కొంటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

### ఏప్రిల్

క్షణం కూడా తీరుబడి లేకుండా మీరు యెంతో కృషి చేస్తేనే గాని యే వ్యవహారమూ సానుకూల పడదు. కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు శ్రమ మీద నెరవేరుతాయి. అధికవ్యయం జరుగుతుంది. ఉద్యోగంలో యెవరితోను వాద ప్రతివాదాలు తగవు.

### మే

మీ స్వంత పనులు సులువుగానే నెరవేరుతాయి గాని యితరుల నిమిత్తం శ్రమ పొందవలసి వస్తుంది. ప్రతి వ్యవహారంలోను మీకు యేదో ఒక సందేహం కలుగుతూనే ఉంటుంది. వ్యాపార రీత్యా చేసే ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ శక్తిసామర్థ్యాలు అధికారుల చేత గుర్తింపబడగలవు.

### జూన్

వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితి యేర్పడుతుంది. కొన్ని వ్యవహారాల్లో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని మోసగించే ప్రమాదం ఉంది. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడం వలన లాభించే వ్యవహారాలను కూడా వదులుకోవలసి వస్తుంది. ఆరోగ్యం బాగా ఉండదు. అధికవ్యయం జరుగుతుంది.

### జూలై

ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వృత్తిలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. ఉద్యోగంలో సాటివారితో యేర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విలాసవస్తువులు కొంటారు.

### ఆగస్టు

భారీయెత్తున చేసే వ్యాపారాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

### సెప్టెంబరు

కొన్ని పనులు సులువుగా నెరవేరినా, మరికొన్నింటిలో శ్రమ కలుగుతుంది. ఇతరుల మూలంగా మీరు నిందలకు గురి కాగల ప్రమాదం ఉంది. సాహసముతో కూడిన వ్యవహారాలు కొంతవరకు లాభిస్తాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

### అక్టోబరు

కొంతమంది వ్యక్తులు మీకు మిత్రులుగా నటిస్తూనే మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. డబ్బు యిచ్చి పుచ్చుకోవడాల్లో చికాకులు రావచ్చును. ఉద్యోగంలో మీరు యిదివరకు చేసిన నిర్ణయాల వల్ల యిప్పుడు యిబ్బంది కలుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి.

### నవంబరు

వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. మీ మంచితనమే కొన్ని వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలదు. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

### డిసెంబరు

మీరు కొన్ని వ్యవహారాల్లో భవిష్యత్తును ఆలోచించడం వలన ప్రస్తుతం పొందవలసిన లాభాన్ని పొందలేకపోవచ్చును. నూతన వ్యాపారాలు లాభిస్తాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి రాగలదు. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

(పైవారం ధనుస్సు, మకరం)

—మహేష్






**యస్. ఆర్. ప. ఆర్, నల్లబసాయిపల్లె**

రామలక్ష్మిగారూ మీరెక్కువ వ్యాసరచన చేస్తూ ఉంటారు కదా! వ్యాసరచన కథా రచన కన్న కష్టమని నా అభిప్రాయం. మీరేమంటారు?

కొత్తలో అలాగే ఉండేది నాకూను. కాని అభ్యాసము కూసు విద్య అన్నారు కదా?

పుట్టిన పిల్లను హత్య చేయడానికీ పుట్టబోయే వాళ్లను చేయడానికీ తేడా ఏముంది అన్నారు కీ. శే. గోపీచందు.

ఇప్పుడాయన ఉండిఉంటే అలా అనేవారుకాదు. హాయిగా రేడియోలో కుటుంబనియంత్రణ గురించి ఘోషించేవారే. పుట్టకుండా చేయడం పాపం అంటే ఇష్టం లేకుండా పిల్లల్నికని వారికి భూమిమీద నరకం సృష్టించడాన్ని ఏమనాలి?

**ఎస్. ఎస్. డి, కాకినాడ**

డైవోర్సు గురించి ఎవరైనా వ్యాసం రాస్తే బాగుండును. పోనీ మీరే వ్రాయ కూడదా?

రాస్తాను. ఓపికపట్టండి. తెలిసిన లాయరుతో సంప్రతించి విషయాలు వివరాలు సేకరిస్తున్నాను.

**ఎ. బి. హెచ్, సాలూరు**

రామలక్ష్మిగారూ, హనుమంతునికి పెళ్లి అవలేదంటాను నేను. నా ఫ్రెండు అయిందంటుంది. ఏది నిజమండీ ?

అయిందట. అతని భార్యపేరు సువర్చల అని మాత్రమే—చెప్పారు పూర్వగాథా లహరిలో. వివాహం ఎప్పుడెలా జరిగిన వివరాలు తెలియవు.

**బి. ఎమ్. ఆర్, రాజమండ్రి**

కష్టాలలో చెప్పుకుంటే కదా మనస్సు బాధ తీరుతుంది.

నిజమైన కష్టాలు మూగగా అనుభవించేవే. కష్టాలని మనం కోడై కూసేవి ఉట్టి అరుపులు. నిజంగా కష్టపడేవాళ్లు లోకానికి తమ కష్టాలుమొరపెట్టరు. ఉట్టివాళ్లే అలా అరిచేది. 'గొడ్డు గేదెల కరుపులు గొప్పకానె?'

**పి. జె. కె, విశాఖపట్నం**

నాకు క్షణం యోచించకుండా పని చేసుకుపోవాలని ఉంటుంది. అంతా ఆత్ర గాడని వేళాకోళం చేస్తున్నారు. ఎలా ?

ఆలోచించడానికే వ్యవధి లేనివారికి చక్కదిద్దుకునే వ్యవధి ఎక్కడుంటుంది? కొంచెం స్పీడు తగ్గించండి. తప్పులేదు.

**టి. ఎస్, ఉయ్యూరు**

శరత్ రచించిన దేవదాసుపై గల మీ అభిప్రాయం చదివాను. బెంగాలీ రసగుల్లాకు మల్లే శరత్ సాహిత్యం చప్పగాను తీయగాను ఉండదు. హృదయాన్ని కదిలించే సంఘటనలవి. కన్నీటిని కురిపించే మాటలవి. మనస్సులో మాయని ముద్రలా చోటు చేసుకున్న పాత్రలవి పవిత్రమైన ప్రేమని, జీవితంలో కల కష్టసుఖాల్ని సంఘంలో కల స్త్రీ విలువని, కళ్లను కనిపించిన గొప్ప రచయిత వారు. దేవదాసు వెన్నెముకలేని హీరోకాదు. మనసు మానవత్వంగల మనిషి మాత్రమే...

నన్ను అపార్థం చేసుకున్నావు పారూ!!!

**బి. ఎస్, చందువార, మధ్యప్రదేశ్**

మాకు మూడువందలు రాబడి. నూట యేభయికంటే కర్చు అవదు. కాని మా వారిది కొంచెం భారీచెయ్యి ముందు వెనుకలు ఆలోచించరు. 20 వ తేదీ వచ్చేసరికి అప్పులకి వెళ్లవలసి వస్తూంది. నే చెప్తే అర్థం చేసుకోరు. ఇంటికర్చు అయ్యేదైనా నా చేతికి యివ్వరు. దయచేసి ఏదైనా ఉపాయం చెప్పండి.

పువ్వుల విషయంలో, కట్టుకున్న చీర రంగు విషయంలో భార్యాభర్తలకి సరదాగా భేదాభిప్రాయాలు ఉండచ్చునే కాని యింటికయ్యే కర్చు విషయంలో ఉండకూడదు. ఇద్దరూ కూర్చుని నిర్ణయించుకోండి. మీదగ్గిరే డబ్బుంటే ఆ చేసే అప్పు—ఎడం చేతిది కుడిచేతికివ్వచ్చు! నేర్పు ఉండాలి సోదరీ భార్యామణికి.

**కె. ఎ. ఎన్. హైదరాబాదు**

గాంధీజీ మూడు కోతులనే ఎందుకు ఉపయోగించారు ? ముగ్గురు మనుషులను ఎందుకు ఉపయోగించలేదు ?

కోతికి బుర్ర లేదు కదు సోదరీ— ఓసారి వద్దు అన్న పని చేయదు. మనిషి అలా కాదే—చెడు చూడకు అంటే వేళ్ల సందునుంచి దొంగతనంగా చూస్తాడు— ఏమంటావు?

**బి. ఎల్. ఆర్, తిరుచిరాపల్లి**

నేను కొన్ని భావగీతాలు రచించాను. నాకు గేయ ఛందస్సు తెలియదు. అందుకని పత్రికలకి పంపడానికి భయపడుతున్నాను...

వచనమే కవిత్వం అవుతున్న యీరోజుల్లో చందస్సు గురించి బాధపడ్డం అబ్బురంగా ఉంది సోదరా, నిర్భయంగా పత్రికలకి పంపు.. ఇప్పుడు కవిత్వం పేర వస్తున్న రచనలని చదువుతూ కూడా యిలా పిరికి పడ్డం ఏమిటి?

**బి హెచ్. వి. కె. ఆర్, చీపురుపల్లి**

నేటి పరిస్థితులనుబట్టి మనిషికి చదువు అవుసరమా? డబ్బు అవుసరమా ?

ఏనాటి పరిస్థితులను పట్టి అయినా, మనిషికి రెండూ ఎంత లేదన్నా కొంతైనా కావాలి బ్రదర్... చదువుండి డబ్బుంటే మరీ హాయి. ఒకవేళ డబ్బు పోయినా, చదువు మిగులుతుంది.

**వి ఎస్. ఎన్. ఎమ్. దార్లపూడి**

...జాకీ వివాహంపై మీ వ్యాఖ్య ప్లీజ్

వివాహం అన్నది పూర్తిగా వ్యక్తిగతమైన విషయం..అని మరోసారి అందరికీ నిరూపించింది. అంతకుమించి దీనికి వ్యాఖ్య దేనికి?

**కుమారి ఏలేశ్వరపు వసంత శ్రీదేవి, ఎమ్. ఏ, స్వర్గాశ్రమము**

...ఈనాటి కృత్రిమ సమాజం మొక్క జగన్నాథ రథ చక్రాల క్రింద ఎంతమంది అమాయకులు దేవదా, రమేషులవలె నలిగిపోతున్నారో ఊహించడానికే భయం వేస్తుంది. దేవదా మీద మళ్లీ మీరు వ్రాయండి. కొంచెం జాలి చూపించండి. దేవదాని మీరు ప్రేమించలేదంటే, అతన్నంత చులకనగా భావిస్తున్నారంటే నేను నమ్మలేకుండా ఉన్నాను. దేవదా నాకు తమ్ముని వంటి వాడు. ఆత్మీయుడు... నేను దూరదేశంలో ఉన్నాను ... నా పూర్తిపేరు వేయండి...

దేవదాసు చిన్నతనంలో ఒకటికి పదిసార్లు చదివి కంట తడిపెట్టిన బాపతే నేనూ. కాని వయస్సుతో పాటు సాహిత్యంలో అభిరుచులు మారి అభిప్రాయాలు మారతాయి. ఇంతెందుకు పదేళ్ల నాడు నే రాసిన రచనే యీరోజు అసందర్భంగా తోస్తుంది. దేవదాసు మీద కోపం ఉండాలి. ప్రేమేనా ఉండాలి. జాలి చూపమంటా రేమిటి? తనకి తను సహాయం చేసుకోలేని, అందుకు ప్రయత్నమేనా చేయని, నిర్భాగ్యుడు జాలికి కూడా పాత్రుడు కాడని నా అనుమానం.

**సీరియల్**




### జరిగిన కథ

లలితకి మోహన్‌తో పరిచయమవుతుంది. అది ప్రేమగా పరిణమిస్తుంది. పెళ్ళికూడా చేసుకోవాలనుకుంటారు. ఆస్తికోసమే మోహన్ తనని పెళ్ళిచేసుకోదలిచాడని తెలుసుకున్న లలిత అతనితో తెగతెంపులు చేసుకుంటుంది. లలితకి పెద్ద దిక్కయిన అత్తయ్య చనిపోతుంది. లాయరు సనుపున ఆమె బలరామ శాస్త్రిగారి [illegible] గార్డియన్ ఇంటికి వెళ్తుంది. అక్కడ అతని మేనత్త సరస్వతమ్మా, కూతురు సరళ వుంటారు. వారికి లలితంటే గిట్టదు. బలరాం లలితమీద ఎక్కువ శ్రద్ధ చూపిస్తూ వుంటాడు.

---

## 5

గేటులోంచి దూసుకుని కారుని పోర్టికోలో ఆపింది లలిత. ఉత్సాహంతో ఆమె మనస్సు ఉరకలువేస్తోంది. జుట్టు ఎగరకుండా కట్టిన స్కార్ఫ్ ఒక్క లాగుతో విప్పేసింది—కందిన చెంపలు ఎర్రగా ఉన్నాయి. నుదుటిమీద చిరు చెమటలు మెరుస్తున్నాయి. నడుముచుట్టూ దోపిన పైటకొంగు విప్పి నుదురు అద్దుకుంది—చేతితో రేగిన ముంగురులు వత్తుకుంది. రెండేసిమెట్లు ఎక్కుతూ తనగదిలోకి వచ్చి పడింది. మూడు నాలుగు వారాలుగా నేర్చుకుంటుంది కారుతోలడం. ఈ రోజే తొలిసారిగా పక్కన సుబ్బారావుగారు లేకుండా జుంయ్‌మని నాలుగు ఫర్లాంగులు తోలి గేటులోంచి ఇంట్లోకి తెచ్చింది కారుని! కాళ్ళూ చేతులు వణక్కుండా కార్ని ముందూ వెనుకలు దేనికీ గుద్దించకుండా రాగలిగింది. అదీ లలిత ఉత్సాహానికి కారణం.

'బలరాం మెట్లపైన నిలబడి ఉండి ఉంటే ఎంత బాగుండును' అనుకుంది తనంత హుందాగా కారు తీసుకొచ్చి నిలబెట్టడం అతను చూసి ఉండవలసింది. సరస్వతమ్మగారూ, సరళాకూడా చూసి ఉంటే ఎంత బాగుండును. వాళ్ళెవరూ తను రావడం చూడక పోవడంతో లలితలో ఉత్సాహం కొంత తగ్గిపోయింది. అద్దంలో తన ముఖంచూసి సన్నగా నవ్వుకుంది. కాని మరు క్షణంలోనే ఆనవ్వు నిట్టూర్పుగా మారిపోయింది.

తనిక్కడికి వచ్చి అప్పుడే ఆరువారాలు దాటిపోయిందంటే ఆశ్చర్యంగా ఉంది లలితకి. ఒక్కొక్కప్పుడు — ఇంకా చాలా ఎక్కువ రోజులే అయిపోయినట్టు అనిపించేది లలితకి — అత్తయ్యదగ్గర ఉన్న రోజులు, ఆ కట్టడులూ, ఒత్తిడులూ లేకపోవడమే—ఆ కాలం అంత దూరంలోకి వెళ్ళిపోడానికి కారణం ... ఈ ఆరేడు వారాల లోనే — తనకి భవిష్యత్తు కేసే గాని భూతంలోకి చూడాలనే అనిపించలేదు ... ఒకవేళ జ్ఞాపకం చేసుకున్నా కూడా అదంతా అందమైన పొరల మాటునుంచి చూస్తున్నట్టుగా ఉంది లలితకి. పాత జీవితంలో ఒకే ఒక సంగతి బాగా మనసులో నిలచిపోయింది లలితకి. ఇదివరకంత బాధ పెట్టకపోయినా మోహన్ జ్ఞాపకం వచ్చినప్పుడు—మనస్సు నెప్పి పెడుతోంది. అయినా మోహన్‌తో తన స్నేహం బలీయంగా పాతుకు పోనందుకు మనస్సులో ఓ మూల సంతోషంగా ఉంది... అదే జరిగి ఉండి, తను మొండిగా పెళ్ళి చేసుకుని ఉంటే ? అన్న ఊహ వచ్చినా భయం వేసింది లలితకి. పెళ్ళిమాట ఎత్తకముందే తన కింత ఆస్తి పాస్తులు వస్తాయని తెలిస్తే మోహన్ అసలు గుణం ఎప్పటికీ తను గ్రహించి ఉండేది కాదు. తీరా పెళ్ళయ్యాక, తనని తన కోసంకాక డబ్బుకోసం పెళ్ళాడాడని తెలిస్తే ? అమ్మయ్యో ఇంకేమైనా ఉందా—తన గుండె పగిలి ఉండేది—అతగాణ్ణి అంత నిండుగా తొలి ప్రేమనుండీ ఆదర్శాలన్నిటితోటీ, ఆవేశంతోటీ వలచింది. అందుకే ఇప్పుడు అలా జరగడమే మంచిదయింది అనిపించింది లలితకు. అది ప్రేమో, మోహావేశమో తెలిసేది కాదు—అప్పుడు...ఇప్పుడు హఠాత్తుగా మోహన్ ఎదురైతే ? తన ఊహలు ఎలాఉంటాయా అని ఊహించి చూసింది. అప్పటి లలిత లాగా ఈ లలిత గుడ్డిగా గ్రీకు దైవం లాగా అందమైన విగ్రహం చూసి మూగపోదు ... ఈ నాటి లలితకి లోకజ్ఞానం ఉదయిస్తోంది. మనుష్యులలో తిరగడం, వారి ప్రవర్తనలని పరిశీలించడం, వారు ఎలాంటివారో గ్రహించడం లాంటివి తెలుస్తున్నాయి. పూర్వం ఈ అవకాశం ఎప్పుడూ ఇవ్వలేదు అత్తయ్య. అప్పుడు తనకి తెలిసిన ముఖాలన్నీ అత్తయ్య స్నేహితులే. చుట్టాలే. ముసలివాళ్ళు. ఈ ప్రపంచపు పోకడలకి ఆట్టే విలువనియ్యని వాళ్ళు. అందుకే పోల్చిచూసే అవకాశాలు ఎప్పుడూ కలగలేదు లలితకి. అందుకే మోహన్ తనని మోసగించ కల్గాడు — తీయని మాటలతోనూ, అతి హృద్యమైన అయిన ప్రవర్తనతోనూ—అనుకుంది. మోహన్ గురించి ఆలోచిస్తూంటే లలిత ఊహలు, బలరాం మీదికి మళ్ళాయి. గత మాసంన్నరగా ఇతని పంచన కాలం గడుపుతూ కూడా స్వేచ్ఛ లేదని అనుకోలేదు. వస్తూనే ఇక్కడనుంచి వెళ్ళిపోవాలని పించినమాట వాస్తవమే. కాని అలా చేయ

డానికి కారణాలు కనిపించలేదు. అటువంటి కారణాలకి బలరాం ప్రవర్తనగాని అధి కారంగాని ఎప్పుడూ అవకాశం కల్పించ లేదు బలరాం చాలా విశాల స్వభావం కలవాడని కొద్ది రోజులలోనే గ్రహించింది లలిత. 'నీ యిష్టం వచ్చినట్టు ఉండు. కాని మా మామయ్యకీ నాకూ ఉన్న స్నేహం మరిచి, మా అత్తయ్య నాపై ఉంచిన నమ్మక మరచి మాత్రం ఎప్పుడూ ప్రవర్తించకు' అన్నాడొకసారి. అంతే మళ్లీ ఎప్పుడూ ఏ ప్రస్తావనా తేలేదు. లలితకూడా అతని చుట్టూ తిరక్క స్వంతంగా బ్రతకడం ప్రారంభించింది— అతను బాక్‌గ్రౌండులో ఉన్నాడని కొండంత ధైర్యం వచ్చింది లలితకు.

రెండు రోజులై బలరాం ఊళ్లో లేడు—ఇల్లు చిన్నబోయినట్టు అనిపించింది అతను లేకుంటే. యజమాని ఇంట్లో లేకుంటే సరస్వతమ్మ గొంతు పెరుగు తుంది. అథారిటీ వెలిగిస్తుందని యిట్టే గ్రహించింది. ఇదొక తరహా కాబోలు—అని సర్దుకుంది.

సుబ్బారావుగారు బలరాంకి చాలా కావలసిన వారు కాబోలు. మిలటరీలోంచి రిటైరైన ఆఫీసరు. ఆ అథారిటీ హుందాతనం మొక్కపోక నిలిచాయి ఆయనలో. లలితకి డ్రైవింగు నేర్పమని ఆయన్ని అడిగాడు బలరాం. సరస్వతమ్మ వద్దని ఎంతో చెప్పింది. పరాయి పిల్లకి ఏ కాలో చెయ్యో విరిగితే పరువు పోతుంది అంది.

'లలిత పరాయిదేమిటి? ఎవరేనా వింటే నవ్వుతారు. సరళ కారు తోలుకోవడం లేదూ—అవసరం వస్తే. అలాగే లలితా.' అన్నాడు బలరాం.

ఆవిడగారికి లలితనీ సరళనీ సమానా ఫాయిలో చూడ్డం ఎలా ఇష్టం ఉంటుంది ?

'సరళ సంగతి వేరు. అది యీ యింటిదని మనవాళ్లకెవరికి తెలియనిది బలరాం !' అంది నవ్వుతూ.

'లలిత అంతకంటే నత్తయ్యా,' అంటూ అక్కడితో ఆ సంభాషణ అంతం చేశాడు బలరాం.

ఆ మాటలీనాడు లలిత చెవుల్లో స్పష్టంగా వినబడుతున్నాయి. అందుకే సరస్వతమ్మ చూస్తే బాగుండును ! సరళ చూస్తే బాగుండును అనుకుంది. బలరాం చూస్తే బాగుండును— అనుకుంది లలిత. ఆ రోజు అతని పట్టుదల చూసి చకితురా లైంది లలిత. 'పట్టితే మొండివట్టే. ఈ వ్యక్తితో వాదించలేం' అనుకుంది. అదేమిటో మొండివాడు, తన యిష్టమే చెల్లాలనుకునేవాడూ అయినా అతనిపట్ల లలిత మనస్సు విముఖత చూపడం లేదు.

ఆ రోజునుంచి కూడా సరస్వతమ్మగారు లలితతో కొంచెం ముభావంగానే ఉంటు న్నారు. బలరాం ఊళ్లో లేకపోతే ఆ తల్లీ కూతుళ్లకి ఓ క్షణం ఇంట్లో కాలు



# ప్రేమించు ప్రేమకై

నిలువదని గ్రహించింది లలిత. చుట్టు పక్కల చాలామంది తెలిసిన కుటుంబాలున్నాయి. అప్పుడూ అప్పుడూ సరళతో పాటు వాళ్ళ పిల్లలూ వస్తూ ఉంటారు. కాని ఎవరితోటీ అతిగా మాట్లాడే అలవాటు కొలేదు లలితకి. వాళ్ళ వేష భాషలామెని అదరకొట్టేయి. సరళ స్నేహితులలో చాలామటుకు తెలుగు రానివాళ్ళే ఎక్కువేమో అనిపించింది లలితకి. ఒకటే 'ఓ.' 'ఆ' లతో వారి ఇంగ్లీషు, 'హాయ్' అంటూ వారి పలకరింపులు గమ్మత్తుగా తోచాయి లలితకి. ఒంటరిగా గడపటం అలవాటైన లలితకి కారు తోలడం నేర్చుకోవడం, పుస్తకాలు తిరగేయడం, చుట్టూ ఆవరించిఉన్న ప్రకృతిలో లీనమైపోయి హాయిగా కాలం గడపడం ఎంతో బాగుంది. ఇంకా ఓపిక ఉంటే లత్తని వెంట పెట్టుకుని కొంచెం దూరాలలో కన్పించే తోటవెంట, ఇంకా దూరం దూరంగా పోయే కొండల దగ్గరికి నడవాలని ప్రయత్నించేది. అత్తయ్య ఉన్నప్పుడుండే స్తబ్దత గాని, మోహన్ తెలిసాక కల్గిన ఉద్వేగం హడావిడిగాని లలిత కిప్పుడు కన్పించటం లేదు. కొత్తగా రెక్కలు వచ్చినట్టు ప్రమాదాలు రాకుండా కాపాడే వాళ్ళొకరున్నట్టు ధైర్యంగా ఉంది. ఆ ధైర్యమే లలిత చెంపల్లో కెంపులని పూయించింది, రెండు నెలల యీ ప్రకృతి పరిశీలన లలితలో కొత్త వెల్గు నింపింది.

సరస్వతమ్మగారి కంటే కూడా లలితంటే అసలు పడనిది సరళ. యీ సంగతీ సులభంగానే గ్రహించింది లలిత. లలిత ఉనికిని గుర్తించినా గుర్తించనట్టు మసలేది. చూసీ చూడనట్టు ఊరుకునేది. తన స్నేహితులకి లలితని పరిచయం చేయాలని ప్రయత్నంకూడా చేయలేదు సరళ. తన వయసు స్నేహితురాళ్ళుంటే చాలా ఉల్లాసంగా ఉంటుందనే అనుకునేది లలిత. కాని సరళ అందుకేమాత్రం సుముఖం కాదని గ్రహించాక స్నేహంగా ఉండాలన్నా ప్రయోజనం ఉండదని నిర్ణయించుకుంది.

వాలుజడ విప్పి దువ్వుకోవడం ప్రారంభించిన లలితకి కిందకి వెళ్ళాలంటే అంత యిష్టంగానే లేదు. బలరాం లేడు. ఇల్లంతా బోసిగా నిశ్శబ్దంగా ఉన్నట్టుంది. నన్నెందుకీ ఒంటరితనం పీడిస్తుంది? అని ఆశ్చర్య పడింది లలిత. జుట్టు వదులుగా అల్లుకుని ముఖం నీళ్ళతో కడుక్కుంది, కళ్ళు చల్లగా అయ్యాయి నుదుట కుంకుమ పెట్టుకుని — తన ఊహాలోకానికి ఒక్కొక్క మెట్టే దిగడం ప్రారంభించిన లలిత బూటు చప్పుడు విని తలెత్తింది—ఎదుట కింది మెట్టుమీద కాలేసి నిలబడి ఉన్నాడు బలరాం.

'ఓ బలరాం, వచ్చేశావా?' అంటూ గబ గబ క్రిందికి దిగింది—చేయి ముందుకు చాపుతూ.

ఆ చేతిని తన చేతిలోకి తీసుకుంటూ ఆమె ముఖంలోకి చూసి నవ్వాడు బలరాం.

'హల్లో—వచ్చేశాను మళ్ళీ' అన్నాడు.

తన తొందరపాటుకీ ఆత్రానికీ సిగ్గుపడింది లలిత. చేయి తీసేసుకుని తల వంచింది. అయినా కూడా ఆమెలో చెలరేగిన ఉత్సాహం అణగిపోలేదు. గుండె గబగబ కొట్టుకుంది. 'ఈ రోజే వస్తావని తెలియలేదు నాకు' అంది నెమ్మదిగా...అంతే ఉత్సాహం ఉరకలువేస్తూంటే చెప్పేసింది—

'ఇదో రెడ్‌లెటర్‌డే బలరాం, నేను దేనికీ కొట్టించకుండా కారు ఓ అరమైలు తోలాను. ఇంట్లోకి తీసుకొచ్చి పోర్టికోలో ఆపాను. నువ్వుంటేనా?' అంది. 'సుబ్బారావుగారు ఎంతో ఆనందపడిపోయారు. నేనింక ధైర్యంగా కారు తోలొచ్చునని సర్టిఫికేట్ ఇచ్చేశారు' అంది.

'అయితే కారు కొనాలి. అవునా!'

ఉత్సాహాన్ని అణచుకోలేని తన పసితనానికి సిగ్గు పడింది లలిత.

ఎందు కంత ఉత్సాహపడిందో అతని రాకని చూసి వివరించి చెప్పినా, బలరాం ఆమె కనపరచిన ఆనందాన్ని మరిచిపోలేకపోయాడు ... హాల్లో ముందు కుర్చీలో కూర్చున్నాకూడా అతని ఊహలు యీ వయసుకత్తె మనసుని అర్థం చేసుకోవడం ఎలాగన్న ధోరణిలోనే ఉన్నాయి. ఆమె చేతి స్పర్శ యింకా అతని అరచేయిని వదలినట్టు అనిపించలేదు. ఈ అమ్మాయి రాకముందీ ఇల్లు ఇలా ఉత్సాహంగా ఉండేదా? జ్ఞాపకం రాలేదు బలరాంకి. సుబ్బమ్మ గారి పెంపకమే మంచిదని పించింది — చుట్టూ ప్రపంచంతో తిరిగి తిరిగి మొరటు తేరిన సరళ ధోరణికీ ఈ లలిత ధోరణికీ ఎంతో తేడా కన్పించింది...

'మీరు వెళ్ళినపని జరిగిందా?' ఏదో అనాలి కనుక అడిగింది లలిత.

'మీరా?' అంటూ నవ్వాడు బలరాం. 'నేను ముసలివాణ్ణి అయిపోతున్నాను. ఇల్లు వదలి ఎక్కడైనా వెళ్ళాలన్నా, అందరినీ కలుసుకోవాలన్నా విసుగ్గా ఉంటూంది. కాని భూమి పుట్రా చూడకపోతే పెరగవు. అలాగే వ్యాపారాలూను. ఏంచెయ్యను చెప్పు?...ఇల్లు కన్పించాక అమ్మయ్య! అనిపించింది. ఇల్లంతా నిశ్శబ్దంగాఉంటే ఎవరూ లేరనే అనుకున్నాను. కాని లత్త చెప్పింది—నువ్వున్నావని.' అన్నాడు బలరాం. వంటావిడ కాలు బెణికింది. లత్తే కాఫీ కప్పులు పట్టుకువచ్చింది వణుకుతున్న చేతులతో.

'పోనీ చాలా నమ్మకస్తులైన ఎవరికైనా కొంత పని అప్పగిస్తే సరి...' అంటు ఏదో సూచించపోతూ కారాగిన చప్పుడు విని ఆగింది లలిత.

'నువ్వు వచ్చేశావా బలరాం. ఈ రోజు వస్తావనుకోలేదే' అంటూ సరస్వతమ్మ గారు లోపలికి వచ్చారు.

'హాయ్, బలరాం వచ్చావైన్ ?' అంటూ అమాంతం వచ్చి బలరాం కూర్చున్న కుర్చీ చేతిమీద వచ్చి కూర్చుంది సరళ.

'వెళ్ళిన పను లన్నీ సవ్యంగా జరిగిపోయాయా?' అంటూ గర్వంగా కూతురికేసి చూసింది సరస్వతమ్మ.

'నేను ముసలాణ్ణయి పోతున్నానని యిప్పుడే లలితకి చెప్తున్నాను. రిటైరైపోవాలింక!' నవ్వుతూ అన్నాడు బలరాం.

'ఎవరేనా వింటే నవ్వుతారు' అంది లలిత సరదాగా.

'ఇదిగో తల్లో పండు వెంట్రుకలు కన్పిస్తూంటేనే' అంటూ అతని క్రాపు సరిచేసింది సరళ.

'నే వెళ్ళాక సరళతో స్నేహం ఎక్కువైందా లలితా? సరళలా తయారయ్యావంటె ఈ జన్మకి పెళ్ళి కాదు నీకు' అన్నాడు కాఫీ తాగుతూ బలరాం.

'నేనేం చేయలేదు. సుబ్బారావుగారితో గడపాను కాలంఅంతా— డ్రైవింగు నేర్చుకుంటూ' అంది. ఎంత వద్దనుకున్నా అత

# ప్రేమించు ప్రేమకై

నలా అంటు చచ్చేసిగ్గు ముంచుకొస్తుంది లలితకి. కాని అతని ముఖంలోకి చూడకుండా ఉండలేదు.

'ఇల్లు ఈ పాటికి తలకిందులు చేసి ఉంటారనుకున్నాను మీ రిద్దరూ' అంటూ ఎవరో వచ్చిన అలికిడికి లేచాడు బలరాం. వచ్చినావిడని చూసీ చూడగానే ఆదరంగా ముందుకినడిచి లోపలికి ఆహ్వానించి కూర్చో పెట్టాడు. ఆప్యాయంగా అతని తలపై చేయివేసి రాశారావిడ.

కూర్చుంటూనే 'నువ్విక నన్ను చూడడానికి రావేమో అని భయపడ్డాను బలరాం, ఏ రంభో, నిన్ను పట్టేసి ఉంటుంది—ఇక నన్ను చూడవచ్చే ఓ కుర్రాడూ రాడని బాధపడి పోయానోయ్' అన్నారావిడ.

'లేదు అమ్మమ్మగారు, నేను చాలా విశ్వాస పాత్రుణ్ణి' అంటూ నవ్వాడు బలరాం.

'లలితా. ఈమె మన సుబ్బారావుగారికి తల్లిగారు. నా యిష్ట బంధువు.' అంటూ లలితని పరచయం చేశాడు. వినయంగా లేచి నిలబడి లలిత నమస్కరించింది.

'ఈ అమ్మాయిని చూడాలనే వచ్చాను నేను. నాకు చూపడానికి ఎందుకు తీసుకు రాలేదని అడగడానికి వచ్చాను. ఈ రోజే సుబ్బారావు చెప్పాడు—' అన్నారావిడ నిశితంగా లలితని పరిశీలిస్తూ.

లలితకూడా ఆవిడని పరీక్షగా వాల్చిన కను కొనలనుంచి చూసింది. పండు తమల పాకులాగా ఉన్న ఆమెకి ఎంత లేదన్నా డెబ్బయి అయిదు ఏళ్ళు దాటేఉంటాయి అని ఊహించింది. అంచులేని తెల్లని పట్టుపంచె కట్టుకున్నారు. తెల్లని వెండి వెంట్రుకలు చిన్నముడిలోయిమిడిపోయాయి. చెవుల రవ్వలదుద్దులు పల్చని తమ్మెలనుంచి ఒదులుగా దిగజారాయి. ఆమె మాట్లాడుతుంటేకదలాడుతున్నాయి. చేతికి గుత్తంగా నాలుగేసి జతల పాతకాలపు బంగారు గాజులున్నాయి. మెళ్లో నాలుగుపేటల చంద్రహారం నాడకంతో తెగసాగి బొడ్డుకింద దాకా వచ్చేసింది.

'నువ్వేనా తీసుకురాలేకపోయావా సరస్వతమ్మ అమ్మాయిని ?'

'ఏమిటో కుదరలేదండీ, లేకుంటే తీసుకురానూ' అంది సరస్వతమ్మ. 'అక్కడికావిడగార్ని తీసుకు వెళ్లకపోతే ఏం మునిగిపోయిందో' అన్నట్టు ముఖం పెట్టుకుందావిడ.

'ఇలారామ్మా వచ్చి నాపక్కన కూర్చో' అంటూ లలితని పిలిచారావిడ.

వెళ్ళి కుర్చీలో ఆమెపక్కనే కూర్చుంది లలిత.

'బలరాం, రామచంద్రం పోలికలున్నాయి కదూ అమ్మాయిలో. బాగుంది కుందనపు బొమ్మలాగుంది. ఏమిటి ఇలా ఇక్కడే మగ్గపెట్టేస్తావేమిటి ? ఈసారి మనవాళ్లంతా పార్టీ ఇస్తే తప్పక తీసుకురావాలి అమ్మాయిని' అంటూ లలిత బుజంమీద చేయి వేశారు. 'పేరుకితగ్గ మనిషి. లలిత ఎంత ముచ్చటైన పేరు' తనలో తనుగా అనుకున్నారావిడ.

తరవాత ఓ అరగంటలో లలిత హృదయం పూర్తిగా దోచుకున్నారు అమ్మమ్మగారు... ఆవిడ సరస్వతమ్మనీ సరళనీ ఉన్నట్టైనా గుర్తించకుండా బలరాంతో మాట్లాడుతుంటే ఆశ్చర్యంగా చూసింది లలిత. ఓ గంట ఆ కబురూ ఈ కబురూ చెప్తూ గడిపారు. తరవాత 'ఇక లేస్తా'నంటూ బయలుదేరారు.

కారుదాకా వెళ్ళి తలుపు తెరచాడు బలరాం.

'ఈసారి లలితని తీసుకురాకుండా నువ్వు రాకు' అంటూ కారెక్కారామె.

ఇదేనందని లలిత తోటలోకి తప్పుకుంది. సరస్వతమ్మని ఎదుర్కోడం అంటే భయంగా ఉంది లలితకి. తన ఉత్సాహం మీద ఇట్టే చన్నీళ్లు చల్లుతుందావిడ అనుకుంది. తల్లీ కూతుళ్లు ముఖాలు చూసుకుని ఊరుకున్నారు.

'ముసలిపీనుగ! అన్నిటిలోనూ తనూ ఉన్నానంటుంది' గట్టిగానే అంది సరళ.

'నువ్వు జాగ్రత్తగా ఉండాలమ్మాయీ ఆవిడగారు సూటిగా బలరాం నువ్వా అమ్మాయిని పెళ్లాడాలి అని చెప్పేయ కలదు.' అని వార్నింగు ఇచ్చింది.

'నీకేం పిచ్చేమిటే అమ్మా, బలరాం కలలో కూడా అలా ఊహించడు. నీకు మతిపోయింది.' అంటూ తోటలోకి చూసింది సరళ.

'ఏమో, నే' అంటూ లోపలికి నడిచింది.

సరస్వతమ్మ.

'ఎన్నాళ్ళగానో అమ్మమ్మగారు చెప్తూనే ఉన్నారు—మంచి అమ్మాయిని పెళ్ళిచేసుకుని ఇక స్థిరపడాలోయ్ బలరాం,' అంటూ. మగవాడి బుర్రలోకి ఆ ఊహ రానే కూడదు. వచ్చిందంటే — అందులోనూ తగని పిల్ల చుట్టూ తిరుగుతున్నప్పుడు—అని సరస్వతమ్మగారి అసలు భయం.

అమ్మమ్మగార్ని సాగనంపి తిన్నగా తన గదిలోకి వెళ్ళిపోయాడు బలరాం. ఈ అత్తయ్య నే లేనప్పుడేం చేస్తున్నట్టు? లలితని నలుగురిళ్ళకీ తిప్పి పరిచయాలు చేసి ఉంటుందని అనుకున్నానే,' అనుకుంటూ బల్లమీద కాళ్ళు పడేసి చేతి కందిన పుస్తకం అందుకున్నాడు.

పుస్తకం తెరవనేలేదు అలా చేతో పట్టుకుని తిరిగి ఆలోచనలలో మునిగి పోయాడు. 'అమ్మమ్మగారన్నది నిజమే. లలితని ఎప్పుడో తన స్నేహితులకీ చుట్టాలకీ పరిచయం చేయవలసింది. లలిత చిన్న వయసులో ఉంది. సరదాగా కాల క్షేపం చేయాలని ఉండదా? ... ఇక్కడా మళ్ళీ సుబ్బమ్మగారితోలాగే ఉంటే పాపం ఏం బాధగా వుంటుందో...నలుగురినీ కలుసుకోవాలి. ప్రపంచం చూస్తే కదా లోకం పోకడ తెలిసేది—నేనే ఆ పనికి పూనుకోవడం ఉత్తమం — సరస్వతత్తయ్య మీద వదిలితే లాభం లేదు' అనుకుని ఓ నిర్ణయానికి వచ్చాడు బలరాం ... ఆలోచనలు ఆగాయి. చేతిలో పుస్తకం తెరిచాడు.

రాత్రి భోజనాల దగ్గర చెప్పాడు బలరాం.

'రేపు నేనూ లలితా టౌన్‌లోకి వెడతాం. కారు సంగతి చూసి అమ్మమ్మగారితో కొన్త కాలక్షేపం చేసి వస్తాం' అన్నాడు నెమ్మదిగా.

తను చేయదలచుకున్నది ఎంత మాటిగా చేస్తాడో మళ్ళీ ఓసారి గ్రహించింది లలిత. అతనికి అడ్డంకులు లెక్కలేదు. వాటిని ఉన్నట్టే గమనించడు.

'నాకూ కొంచెం పనుంది బలరాం' నేనూ సరళకూడా బయలు దేరుతాం. అన్నారు సరస్వతమ్మగారు.

'దానికేం, టిఫెను కాగానే బయలు దేరుదాం. మధ్యాహ్నం భోజనం అక్కడ చూసుకుందాం' అంటూ లేచాడు బలరాం.

రాత్రంతా నిద్రపట్టలేదు లలితకి—

తనకీ అంటూ కారు వస్తుందని ఒకపక్క సంతోషం. మళ్ళీ బలరాంతో తిరిగి రావచ్చు. అమ్మమ్మగారి వంటి ఉత్సాహవంతురాలిని చూడచ్చు—అని ఒకవైపు. నిద్ర రాకుండా చేశాయి.

పొద్దుటే లేచింది మొదలు రత్తి ఒకటే హడావిడి పెట్టింది. ఈ చీర కాదదని, అది కాదిదని ఒకటేగోల అది. 'ఆ సరళమ్మని చూడండి, పొట్టకన్పిస్తూ బొమ్మలాగా కడుతుంది కోక. నీకేం బంగారబ్బొమ్మవి ఎలాకట్టినా అందంగా ఉంటావు.' అంటూ ఎర్రనిచీర జాకెట్టు కట్టి తీరాలంది.

లలిత కిందికి దిగేసరికి అంతా డ్రైనింగు హాలులో బల్లముందున్నారు. ఒక్కసారి అందరికళ్ళు లలితమీద కేంద్రీకరింప బడ్డాయి. గబగబ దిగివస్తూ 'రాత్రి ఏదో చదువుతూ పడుకున్నాను. లేచే సరికి లేటయింది' అంటూ తన స్థలంలో కూర్చుంది.

'ఫరవాలేదు లలితా, అర్జెంటేం లేదు' అంటూ రెప్పవాల్చక లలిత అలంకరణని చూస్తున్నాడు బలరాం.

మరీ గాడీగా బట్టలు వేసుకున్నందుకు లోపల్లోపలే తిట్టుకుంది లలిత.

అంతా బయలుదేరారు బలరాం డ్రైవు చేస్తున్నాడు. పక్కనే సరస్వతమ్మ కూర్చుంది. వెనక లలితా సరళా కూర్చున్నారు. కారు కాంపౌండు దాటేక కాని గమనించలేదు లలిత— సరళ ఎంత ముభావంగా కూర్చున్నదీ.

టౌనులో ఎవరి పనులమీద వాళ్ళు తమకి కావలసిన చోట దిగిపోయారు.

'నువ్వు వచ్చి ముందు కూర్చో లలితా, అంటూ తలుపు తెరిచాడు బలరాం.

సరస్వతమ్మ కూర్చున్న స్థలంలో లలిత కూర్చుంది.

'ఇప్పుడు వెళ్ళి కారు చూద్దాం. ఇప్పుడే తోలుకు వెళ్ళడానికి వీలుండదనుకో—అదొచ్చేసరికి ఎంత లేదన్నా ఎనిమిది వారాలు దాటొచ్చు. ముందు బేరం చేద్దాం. సరేనా?' రోడ్డు చూస్తూ జాగ్రత్తగా కారు నడుపుతూ అడిగాడు బలరాం.

'ఇప్పుడేమవసరము కర్చెమో; పెడిగా నా కొంటుకు కారు? ఎక్కడికెళతాము? వస్తుతే

# ప్రేమించు ప్రేమకై

అంది లలిత.

'నీడబ్బు నీకివ్వడం కర్రేమిటి లలితా,... చెప్పానుకా నేనా ముసలివాణ్ణి. నీ కాళ్ళపై నువ్వు నిలవాలి. తెలుసా?' కొంటెగా నవ్వుతూ అన్నాడు బలరాం.

లలిత కూడా గట్టిగా నవ్వేసింది ... ఇంత స్నేహంగా సన్నిహితంగా ఎప్పుడూ అనిపించలేదు... అందుకే కాబోలు ఇల్లు రెండు రోజులు బోసిగా తోచింది—బలరాం లేకపోవడం...అనుకుంది లలిత.

'నాకసలు డ్రైవింగు వస్తుందనుకో లేదు...అయినా సరస్వతమ్మగారికి నే కారు తోలడం, నువ్వు కొంటాననడం అంతగా ఇష్టం లేనట్టుంది...' నసిగింది లలిత.

'రబ్బిష్! ఇదేం పాతరాతి యుగమా? ఎందరమ్మాయిలు కార్లు తోలుకుంటూ హాయిగా ఉండడంలేదు...అయినా నీకెప్పుడు కావలా అవసరమో నే గుర్తించకలనులే-' అన్నాడు కారుని ఓ కంపెనీ ముందు ఆపుతూ.

'తన ప్రాణం విసిగించకపోతే చాలు కాబోలు, నేనేమైనా అవసరంలేదు' అనుకుంది లలిత. 'అతనికి తలనొప్పి తెప్పించకుంటే చాలు' అన్న ఊహ ఎంతకూడదన్నా



మనస్సులో ప్రవేశించింది లలితకి... అయినా ఎక్కడో కొంచెం తన బాధ్యతని సరదాగానే మోస్తున్నాడు అనిపించకపోతే ఉండ లేదింక అక్కడ. అందుకే అటువంటి ఊహని తలెత్తనివ్వకూడదని తలపోసింది లలిత. తనేమాత్రం ఇచ్చిన స్వాతంత్ర్యం దుర్వినియోగం చేసినట్టు తెలిసినా కట్టడి చేస్తాడు — అందులో సందేహం లేదని కూడా గ్రహించింది లలిత.

సరదాగా, చాలాసేపు పట్టింది కారు బేరం— చక్కని తెల్లటి కారు. రెండు నెలలలో ఇస్తానన్నాడు. అంతే రాతా కోతా ముగిసేసరికి ఒంటిగంట దాటింది. కారుని అమ్మమ్మగారింటికి మళ్ళించాడు బలరాం. అప్పటికే అక్కడి వచ్చేశారు సరస్వతమ్మా సరళ. అమ్మమ్మగారిల్లంతా నవ్వులతో కబుర్లతో కలకలలాడుతూంది. సరళ తన స్నేహితులందరినీ మెట్టేసుకు వచ్చింది.

అందర్నీ బలరాం భోజనానికి ఆహ్వానించాడు. పోలోమంటూ మూడుకార్లలో బయలుదేరారు అంతా. అమ్మమ్మగారితో ఉండిపోవాలని అనిపించింది లలితకి. తను వాళ్ళలో ఈ జన్మకి కలవలేదు.

అయినా బలరాం బలవంతం మీద బయలుదేరింది. బట్లర్లకి ఆర్డరు వినబడనంతగా మాట్లాడుతున్నారు అంతా. మౌనంగా చూస్తూ కూర్చుంది లలిత. సరళ లేచి పక్క టేబిలు దగ్గర భోజనం చేస్తున్న వారిని పలకరించడానికి వెళ్ళింది.

'రా నిన్ను బలరాంకి పరిచయం చేసి తీరాలి. పట్నంలో ఎవరెవరు నా స్నేహితులంటే ఎందర్నో చూపెట్ట కల్గను నిన్ను తప్పించి' అంటూ ఒక వ్యక్తిని చేయిపట్టుకు లాక్కువచ్చింది.

'బలరాం, మోహన్, గొప్ప పెయింటరు రచయిత కూడా' అంటూ పరిచయం చేసింది.

'లలిత, బలరాం చుట్టాలు' అంటూంటే లలిత కళ్ళు పైకెత్తి చూసింది. అంతే మరుక్షణంలో ఆమె ముఖం పాలిపోయింది. మోహన్ కూడా వింతగా ఏదో అద్భుతాన్ని చూస్తున్నట్టు లలిత కళ్ళలోకి చూస్తున్నాడు.

(ఇంకా ఉంది)

తపస్సంపన్నులైన మహామునులకు గొప్ప శక్తి వుంటుంది. వారు ఏది తలచినా, చెయ్యగలరు. శపించడంలోనూ, శిక్షించడంలోనూ వారి శక్తి తిరుగులేనిది. అయినా, ఏ తప్పూ లేనివారి మీద అది పనిచెయ్యదు, తప్పు ఉన్నవారి మీద పని చేస్తుంది కాని, దానివల్ల ఆ మునుల తపోబలం తగ్గిపోతుంది. అందువల్ల ఎట్టి గొప్ప మునులైనా జాగ్రత్తగా వుండాలి. తొందరపడి నిరపరాధులమీద తమ శక్తిని ప్రయోగిస్తే అది వ్యర్థం అవుతుంది. మీదు మిక్కిలి తమకే ఆపద కలగవచ్చును. దూర్వాస మహాముని వంటివాడే తొందరపడి, నానా బాధలూ పడవలసి వచ్చింది.




అంబరీషుడనే రాజు గొప్ప విష్ణుభక్తుడు. నియమ నిష్ఠలు కలవాడు. ఒకప్పుడు ఆయన ఏడాదిపాటు ఎంతో నియమంతో ఏకాదశీ వ్రతం చేసి వ్రత సమాప్తి కాగా ఉపవసించి, ద్వాదశినాడు ఎన్నో దానాలు చేసి, పారణ చెయ్యడానికి సిద్ధంగా వున్నాడు. అలాంటి సమయంలో దూర్వాస మహాముని ఆయన గృహానికి వచ్చాడు. రాజు అతనికి అతిథి పూజ చేసి, తనతోపాటు భోజనం చెయ్యవలెనని కోరాడు. ఆ మహాముని దానికి సమ్మతించి 'స్నానం చేసి యిప్పుడే వస్తా'నని యమునా నదికి పోయి, ఎంతసేపటికీ తిరిగి రాలేదు. పారణ చెయ్యవలసిన కాలం మిక్కిలి స్వల్పంగానే వుంది. ఆ లోపున పారణ చెయ్యకపోతే, ఇన్నాళ్లూ చేసిన వ్రతం వ్యర్థమైపోతుంది. ఏమి చెయ్యడానికీ తోచక రాజు విద్వాంసులతో ఆలోచించాడు. 'మీరు జలం పానం చెయ్యండి. దానివల్ల పారణ చేసిన ఫలం వుంటుంది. నీరు తాగితే భోజనం చేసినట్లూ కాదు, అతిథిని గౌరవించినట్లూ అవుతుంది' అని వారు ధర్మసందేహాన్ని తీర్చివేసి, అంబరీషుని చేత జలపానం చేయించారు.

ఇంతలో దూర్వాసుడు వచ్చాడు. ద్వాదశి గడియలు మించకుండా రావాలనే సంకల్పం అతనికి లేనేలేదు. వచ్చి అంబరీషుడు సలిల పారణ చేసినందుకు మిక్కిలి కోపించి, 'నన్ను భోజనానికి పిలిచి, నేను రాకుండా భుజించి అవమానిస్తావా? దీనికి తగిన ప్రతిఫలం యిప్పుడే అనుభవిస్తావులే' అంటూ పండ్లు పటపట కొరుకుతూ తన జడ నొక దానిని ఊడదీసి మంత్రించి కృత్య అనే శక్తిగా చేసి, అతని మీదికి పంపాడు. అది మంటలు కక్కుకుంటూ రాజు మీదికి వస్తూ ఉన్నది. అంబరీషునితో పాటు అక్కడ వున్నవారందరూ నిర్ఘాంతపోయారు. అతడు ఏమీ తోచక కొయ్యబారి నిలిచి పోయాడు. ఇక నేముందీ? క్షణకాలంలో అతడు ఆ శక్తికి బలి కావలసిందే! ఇదంతా భగవంతుడైన విష్ణువుకు తెలుసును... అతడు వెంటనే రాజును రక్షించడానికీ, మునిని శిక్షించడానికి తన చక్రాయుధాన్ని పంపాడు. అది శక్తిని రూపుమాపి దుర్వాసుని వెంటపడ్డది. అతడు భయపడి బ్రహ్మవద్దకు పోయి రక్షించాలని ప్రార్థించాడు. బ్రహ్మ తన వల్ల కాదన్నాడు. శివుని వద్దకుపోతే ఆయనా అలాగే అన్నాడు. దూర్వాసుడు విష్ణువునే శరణు వేడాడు. అంబరీషుడి దగ్గరకు పోయి అతడినే శరణు వేడాలని విష్ణుదేవుడు సలహా యిచ్చాడు. విధిలేక ఆ మహాముని అంబరీషుని కాళ్లమీద పడ్డాడు. ఆ రాజు మునిని లేవనెత్తి, అతన్ని దయతో చూస్తూ, వెనుకకు మళ్లి పోవలసిందని విష్ణుచక్రాన్ని పరిపరి విధాల ప్రార్థించగా, అది తిరిగి విష్ణు సన్నిధిని చేరుకున్నది. అంబరీషుని భక్తికి దూర్వాసుడు ఆశ్చర్యపడి, అతన్ని స్తుతించి, కడుపార భుజించి వెళ్లిపోయాడు. అంతేకాదు. ఇకనెప్పుడూ విష్ణుభక్తుల జోలికి పోకూడదని మనస్సులో నిశ్చయించుకున్నాడు.

ఇంద్రుని సమస్త సంపదమూ సముద్రంలో కలప గలిగిన దూర్వాసుడు, నిరపరాధిని హింసించదలచి, తానే అవమానాన్ని పొందాడు. అతని తపశ్శక్తి భగవద్భక్తుని యెడ ఎందుకూ పనికి రాకుండా పోయింది.





# చెట్టుకింద ప్లీడరు

కప్పగంతుల మల్లికార్జునరావు

వెంకట్రామయ్యంటే ఆవూళ్ళో చాలామందికి తెలియదు. అయితే 'చెట్టు కింద ప్లీడరు' అంటే ఎవరని, ఎవరినన్నా అడగకండి, సరాసరి ఆయన దగ్గరికే తీసికెళ్తారు.

వృత్తిచేత ప్లీడరు. ప్రవృత్తి చేత సాధువు. అమాయకత్వానికి మారుపేరు. ఇహ లోకసుఖాల మీద కన్నా పరలోకసుఖం మీద ప్రీతి జాస్తి.

అలాగని వెంకట్రామయ్య సర్వసంగ పరిత్యాగి అని చెప్పటానికి వీల్లేదు. ఆయనకీ కోరికలున్నాయి అంతర్గతంగా. అందులో రెంటిని గురించి చెప్పుకోవటం అవసరం. మొదటిది—తన కొడుకును గొప్పవ్యక్తిగా చేయాలి. రెండోది—తనేనాటికైనా న్యాయాన్ని తప్పని గొప్ప న్యాయవాదని అనిపించుకోవాలి.

వెంకట్రామయ్యకు భానుమూర్తి ఒక్కడే కొడుకు. భానుమూర్తి తండ్రి లాగే తెలివిగలవాడు. కాకపోతే యిద్దరికీ ఒకటే భేదం—వెంకట్రామయ్య తనగ్గల తెలివితేటలను తన వృద్ధికి వుపయోగించుకోలేకపోగా, భానుమూర్తి వాటి ఆధారంతో ఐ. ఎ. యస్. పరీక్ష పాసయి కలెక్టరయ్యాడు.

భానుమూర్తి కలెక్టరయిన రోజున వెంకట్రామయ్య ఆనందానికి అవధి లేకపోయింది ఎక్కడ దాక్కొని వుందో 'గర్వం' అన్న పదార్థం కూడా ఆయన్లో వో లేశం ఆరోజు కనిపించింది. తను ప్రాక్టీసులేని ప్లీడరు— తన కొడుకు కలెక్టరు!

బి. ఎల్. పాసై ఆవూళ్ళో ప్లీడరు బోర్డు కట్టిన రోజు, వెంకట్రామయ్య, ఆ వృత్తిలో 'షైన్' నవుతాడని ఆశించిన వాళ్ళు లేకపోలేదు. ఎందుకంటే బి. ఎల్. లో వెంకట్రామయ్య యూనివర్సిటీ ఫస్టు.

అయితే ఆవూరు అసలే 'లిటిగెంట్ల' మయం. రాష్ట్రంలో కల్లా తెలివితేటలు గల (అనగా జుట్టుకు, కాళ్ళకు ముడులు పెట్టే తెలివి) ప్లీడరు గుమాస్తాలు ఆవూళ్ళోనే వున్నారు. నిజానికావూళ్ళో ప్లీడర్ల కన్నా ప్లీడరు గుమాస్తాలకే 'లా' ఎక్కువగా తెల్సు! ఆ 'లా'ను యెలా తిప్పితే తమకు కనుకూలమవుతుందో, ఆ మెళుకువలూ తెల్సు'

వెంకట్రామయ్య దురదృష్టం కొద్దీ, అతను బోర్డు కట్టిన సంవత్సరమే, ఆ వూళ్ళోని పేరు పొందిన అయిదుగురు ప్లీడరు గుమాస్తాల కొడుకులు, ప్లీడర్లయి బోర్డులు కట్టేరు. ఇంకేం? పేరుకు వీరు ప్లీడర్లు. పని వారి తండ్రులది. గుమాస్తా తండ్రి, అంతా వ్రాసిస్తే కంఠతాపట్టి, కోర్టులో మర్నాడు వొప్ప చెప్పేవాడు కొడుకు. అందుకే వాళ్ళు బోర్డు కట్టిన రెండు సంవత్సరాలకే పేరు మోసిన ప్లీడర్లయ్యారు. వాళ్ళల్లో వాళ్ళు పోటీలు పడుతూ, సీనియర్లతో కూడా పోటీ పడటం మొదలుపెట్టేరు.

వెంకట్రామయ్య కలాంటి అండదండలు లేవు. ఎప్పుడూ 'లా' పుస్తకాలలో మునిగి తేలుతుండేవాడు. అందుకే పోటీ మొదటి రవుండులోనే వోడిపోయి వూరుకొన్నాడు.

మొదట్లో సీనియర్ ప్లీడరు ఒకటి రెండు కేసుల్ని తనకి వప్పచెప్పేడు. అయితే ఆ కేసులు వెంకట్రామయ్యకు అన్యాయంగా తోచేయి. న్యాయవాది అయివుండి అన్యాయాన్ని సమర్థించటం ఆత్మవంచన చేసుకోటం, దోషం, పాపం అనుకొన్నాడు. అనుకొని వూరుకొంటే ఎలాగుండేదో? సీనియర్‌తో అన్నాడు. ఆ సీనియర్ నవ్వి యిచ్చిన కేసుల్ని వెనక్కి తీసుకొన్నాడు.

ఆ తర్వాత రెండు కేసులొచ్చాయి వెంకట్రామయ్యకు. రెండూ న్యాయమైనవే. అయితే పార్టీలు

చాలా బీదవాళ్ళు. అందులో ఒకటి వోడిపోయింది. రెండోది గెలిచాడు. అయితే ఆ కేసు గెలవటం వల్ల వెంకట్రామయ్య పేరు పెరగ లేదు. కాగా తరిగిందేమో! "నిజాన్ని నిజమని గెలిపించటం ఏ ముందోయ్? అబద్దాన్ని నిజమని నిరూపించటంలోనే ప్లీడరు పస తెలుస్తుంది" తోటి ప్లీడరెవరో అంటుంటే విని నవ్వుకొన్నాడు.

కోర్టులో పనున్నా లేకపోయినా, పది గంటలకల్లా దేవతార్చన ముగించి, భోంచేసి, మొహాన గంధాక్షితలు, వంటికి నల్లకోటు ధరించి, చేతులో ఏవో కాసిని కాగితాల్తో కోర్టు దగ్గర కనబడేవాడు వెంకట్రామయ్య.

మొదట్లో కాస్సేపు అలా 'బార్ రూం'లో పుస్తకాలు చదువుకొంటూ, కోర్టులో కేసులు వింటూ కాలక్షేపం చేసేవాడు. అయితే 'బార్'లో లాయర్ల ఆత్మస్తుతులు, అడపాతడపా పరనిందలను వింటూ, కోర్టులో సాక్షులు చెప్పే అబద్దాలు వింటూ, ంతో కాలం ఆ పద్దతిని కొనసాగించలేక పోయాడు.

కోర్టు కెదురుగా వో పెద్ద వేప చెట్టు వుంది. ఆ వేపచెట్టు కిందే ఓ హోటలు, చిన్న చిన్న రోడ్డు పక్కదుకాణాలూ వున్నాయి. కాస్త దూరంలో కాలేజీ, కొన్ని ఆఫీసులు కూడా వున్నాయి. కోర్టు పనిమీద, ఆఫీసు పనులమీద వచ్చేవారు, కాలేజీలో చదివేవారు, ఆ కాఫీ హోటల్లో కడుపు నింపుకొని, వేపచెట్టు నీడన్నిలబడి సేద తీర్చుకొంటూ, కబుర్లు చెప్పుకోటం ఆనవాయతే. ఏతావాతా ఆ వూరికి ఆ వేపచెట్టు ఓ పెద్ద 'సెంటర్' అని చెప్పుకోవచ్చు.

పేరు పొందిన ప్లీడర్లంతా ఆ సెంటరుకు అటూ యిటూగా, యెంత అద్దెనా యిచ్చి ఆఫీసు లేర్పాటు చేసుకొన్నారు. వెంకట్రామయ్యకు వచ్చే ఆదాయం భుక్తికే సరిపోదు ఆఫీసూ, యిల్లూ అన్నీ ఒక్కటే! వెంకట్రామయ్య ఆ చెట్టు నీడను ఆశ్రయించాడు!

ఆ చెట్టు నీడనే ఆశ్రయించుకొని వున్న మరో వ్యక్తి శర్మ. శర్మ కొక వృత్తని చెప్పటానికివీల్లేదు. ఆయన స్టాంపువెండరు. పై వృత్తి, ప్రైవేట్లు—డాక్యుమెంట్లు అవీ వ్రాయటం.

కోర్టు జీవితంతో తలపై జుట్టు వూడిపోయింది. మనిషి నేలకు మూరెడు పొడుగు నుంటాడు. కరెక్టుగా చెప్పాలంటే ఆయన యెత్తు మూడడుగుల, మూడంగుళాలు! మూర్తి అంత చిన్నదైనా బుర్ర మాత్రం చాలా పెద్దది. అంత తెలివిగలవాడు ఆ ప్రాంతంలోనే కాదు ఎక్కడా లేరని ప్రతీతి. ఏదైనా కాగితం వ్రాశాడా, సుప్రీం కోర్టుకు పోయినా తిరుగుండదు. సలహా యిచ్చాడా హైకోర్టు కూడా తోసి పుచ్చటానికి వీల్లేనంత బలంగా వుంటుంది.

శర్మ, ఆ చెట్టు కిందే, పక్క నున్న వో పాత పెంకుటింట్లో నివాసం. చెట్టే లేకపోతే, ఆ యిల్లు సర్వభూతాలకు నిలయమని చెప్పవచ్చు.

ప్రొద్దున యెనిమిది గంటలకల్లా స్నానం సంధ్యావందనం ముగించి మొహాన విభూతి, కుంకుమ ధరించి వరండాలోకొచ్చి తన చిన్నబల్ల యెదుట కూర్చుంటాడు శర్మ కూర్చోగానే పక్క హోటల్లో నుంచి అరడజను యిడ్లీలు వస్తాయి. అవితిని, కాఫీతాగి పనికుపక్రమించాడా, రాత్రి ఏ తొమ్మిదింటికో లేచేది. మధ్యలో భోజనానికో అరగంట—

ఏమీ తోచక అక్కడ కూర్చోటానికి పోయేవాడు వెంకట్రామయ్య. క్రమంగా శర్మతో స్నేహం పెరిగింది.

ఊరికే కూర్చో లేక వోరోజు వెంకట్రామయ్యే అడిగాడు— 'నాకేదైనా పనివుంటే చెప్పవయ్యా శర్మా—' అని అంతే .... ఆమరునాటినుంచి వెంకట్రామయ్యకు చేతినిండా పని. పనికితగ్గ రాబడి.

వెంకట్రామయ్య వ్రాసిన ప్రతిడాక్యుమెంటుని శర్మ చూచేవాడు. అవసరమైతే సరిచేసేవాడు కూడా. అది వ్రాయించుకొన్నవాళ్లకూ, డా శర్మ చూడందే తృప్తిలేదు.

అయితేనేం? వెంకట్రామయ్య గౌరవ ప్రతిపత్తులకేం భంగం కలగ్గుండా చూచేవాడు శర్మ. ఆయనగ్గావో కుర్చీ, బల్ల వేయించాడు. అందులో వెంకట్రామయ్య ప్లీడరులా కూర్చుంటే, శర్మ ప్లీడరు గుమాస్తాలా చాపమీద, చిన్నబల్లము ందు కూర్చునేవాడు.

'ప్లీడరు వ్రాసినదాన్ని, గుమాస్తా సరిదిద్దుతాడు రోజా'—అని కొందరు ఎగతాళిగా అన్నా వెంకట్రామయ్య పట్టించుకోలేదు.

కాలం గడుస్తున్న కొద్దీ వెంకట్రామయ్యకు డాక్యుమెంట్లు వ్రాయటంలో చెయ్యి తిరిగింది. డబ్బుకు వెనకటిలా కష్టపడాల్సిన అవసరంలేకపోయింది. కొడుకు చదువు నిరాటంకంగా సాగుతోంది.

ఇలా ఆ చెట్టును ఆశ్రయించి బ్రతుకుతున్న వాళ్లలో వెంకట్రామయ్య కూడా చేరేడు. ఎప్పుడో వచ్చిన, 'చెట్టుకింద ప్లీడరు' అన్న బిరుదం అక్షరాలా ఖాయంగా నిల్చి పోయిందాయనకు!

* * *

ఎలాగోలాగు దిగుల్లేకుండా అలవాటుగా సాగుతున్న వెంకట్రామయ్య జీవితకథ, భానుమూర్తి కలెక్టరుగా కావటంతో మారక తప్పదా అనిపించింది.

భానుమూర్తి చిన్నతనంనుంచీ బాధ్యతలు తెల్సినవాడు. తండ్రికి ఒక్కడే కొడుకైనా, గారాబంగానే పెంచబడ్డా, తన తండ్రి పడ్తున్న కష్టాలను కళ్లారా చూచినవాడు.

తనతండ్రి తెలివి కలవాడు. అయితే ఆతెలివి ప్లీడరు వృత్తిలో రాణించలేదు. ధనార్జనే ఆయన జీవిత ధ్యేయంగా పెటుకోలేదు. ఆయన మనసు బుద్ది, ఎప్పుడు వేదాంత విషయాలమీదే వుండేది. కోర్టులోకాని, భల్లోకాని ఆయన పెద్దగా మాట్లాడలేక పోవచ్చు. అయితే ఆయన పాండితి, ప్రజ్ఞ భానుమూర్తికి బాగా తెల్సు.

అటువంటి తనతండ్రి తనకోసం ప్లీడరైవుండి కూడా డాక్యుమెంట్లు వ్రాసి సంపాదించి తనని చదివించాడు. తను కష్టాలుపడుతూ, తనకుమార్గదర్శక మయ్యాడు.

నిజానికి వెంకట్రామయ్యే కనుక పెద్దలాయరై రెండుచేతులా డబ్బు సంపాదిస్తున్నట్లయితే భానుమూర్తి కలెక్టరు కాలేక పోయేవాడేమో! తండ్రి కష్టాలు కళ్లారా చూస్తూ, 'చెట్టుక్రింద ప్లీడరు' అని ఆయన్నంతా ఎగతాళిగా అనటాన్ని వింటూ అందులోనుంచి పౌరుషాన్ని పట్టుదలను పెంచుకొన్నాడతను. చిన్ననాటి ఆ అనుభవం అతనికి లోకానుభవాన్నిచ్చింది. ఆలోచనా శక్తిని, పెంపొందించింది.

తను ఐ.ఎ.యస్. పాస కాగానే తండ్రి కష్టాలు గట్టెక్కే కాలం వచ్చిందని సంతోషించాడు భానుమూర్తి. ఇక తన తండ్రి పొద్దస్తమానం ఆచెట్టు కింద పాతకోటుతో పడుండాల్సిన అవసరం లేదు. నలుగురుచేత 'చెట్టుకిందప్లీడరు' అనిపించుకోవాల్సిన అవసరమూ లేదు. ఆయనిక కలెక్టరుగారి తండ్రి. ఆయన్ని చూచి నవ్విన వాళ్లే, యిక ఆయనకు వంగి వంగి నమస్కరించాలి.......యిలా ఆలోచించాడు భానుమూర్తి.

తండ్రితో తన ఆలోచనలను చెప్పేడు భానుమూర్తి. ఆయన కొడుకు వైపు వాత్సల్యపూర్వకంగా చూచి ఆనందంగా నవ్వేడు.

'తప్పదు నాన్నగారూ......మీరిక యీవృత్తిని మానేసి విశ్రాంతి తీసికోవాలి—'

'నువ్వు ప్రయోజకుడివైనందుకు సంతోషం నాయనా. కాని అన్నిటికీ ఆ పరమాత్మ వున్నాడు. కానియ్ ... ఆయన ఎలా నడిపిస్తే అలానడుద్దాం—' కొడుకు తలను ప్రేమగా నిమురుతూ అన్నాడు వెంకట్రామయ్య. ఆ మాటల్ని అంగీకారంగానే తీసి కొన్నాడు భానుమూర్తి.

కలెక్టరుగా పోస్టింగ్ మరోజిల్లాలో వో తాలూకాలో వచ్చింది. పెద్ద బంగళా.... నౌకర్లు..... తలిదండ్రులకు కావల్సినంత ప్రశాంతత.... విశ్రాంతి.

తలిదండ్రులను తీసికుపోవటానికొచ్చిన భానుమూర్తికి నిరాశే యెదురయింది. తల్లి—కొడుకు కొదిలి వుండటానికి ఇష్టం లేక యిల్లు వదల్టానికి సిద్దపడ్డా, వెంకట్రామయ్య మాత్రం అందుకు సిద్దపడలేదు.

"ఇది నా నేలరా నాయనా. యిక్కడే పుట్టేను. పెరిగేను. సుఖాలను కష్టాలను అనుభవించాను. ఆచెట్టు—కోర్టు దగ్గర ఆవేప చెట్టు వుంది చూవా పురా నాయనా— అది నాకు ప్రాణం. నన్ను 'చెట్టు కింద ప్లీడరు'ను చేసిందా చెట్టే. నాలో ఆలోచనలను కలిగించిందా చెట్టే. అర్థంకాని ఎన్నో జీవిత సమస్యలకు, జవాబులనిచ్చిందా చెట్టునీడే. ఆఖరికి నాకు దారి చూపించి తిండిపెట్టిందీ ఆ చెట్టే నాయనా. నేనీవూరిని, ఆచెట్టు నీడనూ వదిలి రాలేను నాయనా—'అన్నాడు వెంకట్రామయ్య.

'మిమ్మల్ని గౌరవించలేని, మీ ప్రతిభను గుర్తించలేని, మనుష్యులున్న యీ వూరిమీద మీకెందుకు నాన్నగారూ అంత మమకారం?'

వెంకట్రామయ్య కొడుకు ప్రశ్నకు జవాబివ్వలేదు. సమాధానంగా అతని వైపుచూచి నవ్వేడు. ఆనవ్వులో వేదాంతం వుంది. వాత్సల్యం వుంది—ప్రేమవుంది —పెద్దరికం వుంది. 'మీతరంవారికి

# చెట్టుకింద ప్లీడరు

ఆ మమకారాలు తెలియవులే. అదిచెప్తే తెల్సేదికాదు. అనుభవైకవేద్యం' అన్నట్లు అర్థం చేసుకున్నాడు భానుమూర్తి. అందుకే మరిక వత్తిడి చేయకుండా వెళ్ళిపోయాడు.

ఆరునెలల తర్వాత భానుమూర్తి బదిలీ అయి, కలెక్టరుగా అవూరికే రావటంతో కథ మరోమలుపు తిరక్క తప్పిందికాదు.

నిజానికా ఆరునెలలూ భానుమూర్తి బాధగానే గడిపాడు. సుఖించటానికి ప్రభుత్వం వారు కల్పించిన అవకాశాలున్నా, వాటిని వినియోగించుకోలేదతను. తన తలిదండ్రులు అనుభవించని సుఖాలు తనకెందుకు? అక్కడవాళ్ళు చాలీచాలని, యింట్లో చేసుకోలేక, బాధపడ్తుంటే, యిక్కడ తను బంగాళాలో, నౌకర్లచేత పనులు చేయించుకొంటూ సుఖపడాలా?...... అతని, సంస్కారం, తలిదండ్రులపై గల గౌరవం, ప్రేమ అందుకంగీకరించలేదు.

తన దగ్గరికి తలిదండ్రులు రారు. కనుక తనేవాళ్ల వద్దకెళ్లి కొంతకాలం పొట్టైనా వుండి వాళ్లని సుఖపెట్టాలి. నాన్నగారి జీవిత విధానాన్ని మార్చాలి. అందుకే బదిలీకోసం ప్రయత్నించాడు.

వాస్తవానికి — కొడుకు కలెక్టరయినా, వెంకట్రామయ్య జీవితమార్గం పిసరంత కూడా మారలేదు అదే పాత నల్లకోటు..... అదే పాత యిల్లు.... అదేచెట్టు ..... కుర్చీ...... బల్ల...... అదే పని.....! అయన్ని గురించి అవే మాటలు, హాస్యాలు, బిరుదాలు అన్నీ అవే!

భానుమూర్తి కలెక్టరుగా అవూరు వచ్చినరోజే, అనుకోని కొత్తసమస్య ఎదురయింది—

కలెక్టరుగా— భానుమూర్తి ప్రభుత్వం వారిచ్చిన బంగళాలో వుండవల్సి వుంది. కానీ అదేవూళ్లో తలిదండ్రులు పాతయింట్లో వుండగా, తను—బంగళాలో వుండలేడు. వాళ్లను బంగళాకు రమ్మనక తప్పలేదు.

వెంకట్రామయ్య వుండే యిల్లు పాతది. పిత్రార్జితంగా వచ్చిన ఆస్తి. యాభైయేళ్ల వెంకట్రామయ్య హయాంలో అది మరింత పాత బడింది. ఆయనా యింటికి మరమ్మత్తు లేవీ చేయించలేదు సరికదా, నవనాగరికమైన అవసరాలు కల్పించలేదు. పంకాలులేవు— సోఫాలులేవు— తగినన్ని కుర్చీలు కూడా లేవు.

అయితే వెంకట్రామయ్యకు, తన తాత తండ్రులు జీవించిన యింట్లోనే తానూ జీవిస్తున్నానన్న తృప్తిమాత్రం వుంది. ఇప్పుడు దాన్ని వదులుకు రమ్మంటున్నాడు కొడుకు. ఆత్మానందాన్ని పరిపూర్ణంగా యిచ్చే ఆ తృప్తికన్నా, భౌతికానందాలనిచ్చే భోగాలు తనకు సుఖాన్నివ్వగలవా? లేవనే సమాధానం చెప్పింది అంతరాత్మ.

తండ్రి చెప్పిందీ కాదనటానికి కారణం కనిపించలేదు భానుమూర్తికి. సుఖం పేరిట, తండ్రి అనుభవించే ఆత్మనందాన్ని వదులుకోమనే అధికారం తనకేముంది? కాని వాళ్లను వదిలేసి తనొక్కడూ వుండగలడా?

పరిష్కార మార్గం వెంకట్రామయ్య చెప్పేడు— "కంటియెదుటే వుంటావ్. అంతకన్నా మాక్కావల్సిందేముందిరా? నీవు యీ యింట్లోనే వుందామనుకున్నా, నీ అధికార వ్యవహారాలకు యీ యిల్లు చాలదు. ఇక నీ ఒంటరితనమంటావా? ..... త్వరలో నిన్నొక యింటివాడిని చేస్తే......." ఆనందం నిండిన ఆయన హృదయం నుంచి మాట పెగల్లేదు.

'అంటే— నా కెవర్నో తగిలించి మీరు తప్పుకుంటారన్నమాట!'

నోటిమీద తర్జనిని చూపిస్తూ, 'అలా అనకూడదు నాయనా' అన్నట్లు తలవూచాడు వెంకట్రామయ్య— "నీవు కలెక్టరువయ్యావు. ఈ వంశానికి పేరు తెచ్చావ్. అది మేంచేసుకున్న అదృష్టం. కానీ యిది జీవితంలో ఒక భాగం మాత్రమే భానూ. ఇంతకన్నా కూడా అవసరమైనది సంసార




జీవితం. నువ్వు సంసారివై, పిల్లాపాపలతో వుంటే చూచి ఆనందించాలనుకోటం తప్పుకాదు నాయనా. అది మేము తప్పుకోవటం కాదు— నిన్ను నిరాదరించటమూ కాదు. తలిదండ్రులుగా అది మా కర్తవ్యం—'

ప్రేమ, గౌరవం, భక్తి, కృతజ్ఞత, ఆనందం పెల్లుబికిరాగా, భానుమూర్తి హృదయం భాష్పాలను రాల్చింది. ఆ భాష్పాలతో తండ్రికాళ్ళు కడిగి కళ్ల కద్దుకొన్నాడు.

మరుసటి రోజే భానుమూర్తి తనకు నిర్దేశించిన బంగళాలో చేరేడు. అయితే సమస్య అంతటితో అంతంకాలేదు. కాగా మరుసటి రోజునుంచి మరిన్ని సమస్యలు యెదురయ్యాయి భానుమూర్తికి.

తనావూరి కలెక్టరు కనుక, తన తండ్రి యిక పాతజీవితానికి స్వస్తి చెప్తాడని ఆశించాడు భానుమూర్తి. అయితే వెంకట్రామయ్య కనీసం తనపాత కోటుకూడా విడవలేదు. భానుమూర్తి కలెక్టరుగా కారులో ఆఫీసుకు పోయిన రోజునే, వెంకట్రామయ్య అలవాటు ప్రకారం కాళ్లతో నడిచి కోర్టు ముందు చెట్టుకింద తన స్థానానికి వెళ్ళాడు.

కలెక్టరు బంగళానుంచి, కలెక్టరాఫీసుకు వెళ్ళాలంటే, ఆసెంటరుమీద గుండానే వెళ్ళాలి. తన తండ్రి, ఆపాత యింట్లో, ముసలి కుర్చీలో విరిగిన కళ్లజోడు ధరించి కూర్చొని వుండటం, సాయంత్రం అయిదు గంటలకు జీపులో బంగళాకు వెళ్తూ చూచాడు భానుమూర్తి. చివుక్కు మంది అతని హృదయం.

ఆరాత్రి తండ్రిని కలుద్దామనుకొన్నాడు. వీలు కాలేదు—

మరుసటిరోజు ప్రొద్దున పది గంటలకు భానుమూర్తి ఆఫీసుకెళ్తున్నాడు. వయోభారంతో అనారోగ్యం వల్ల నడవలేక నడవలేక నడిచి వెళ్తున్న తండ్రి కన్పించాడు. మనసు బాధతో మూలిగింది.

జీపు ఆపి ఆయన్ని పలకరించి, ఎక్కించుకొని వెళ్ళాలా? చూచీచూడనట్లు వెళ్ళాలా? మొదటిది తన ధర్మం కొడుగ్గా— రెండోది అధికారిగా తన హోదా. ఒకవేళ ఆపి యెక్కమంటే— ఎక్కనంటే?

ఆలోచనలో వుండగానే ఆయన దగ్గరి కెళ్లింది జీపు. అనుకోకుండానే ఆపించాడు. దిగి 'నాన్నగారూ' అని పిల్చాడు.

వెంకట్రామయ్య కొడుకుని ఆసమయంలో అలాంటి స్థితిలో చూచి నివ్వెరపోయాడు. ఆతర్వాత ఆఫీసరు హోదావున్న అతన్ని చూచి మురిసిపోయాడు. అంతా ఒక్క క్షణం మాత్రమే. మరుక్షణంలో ఆయనకి పరిస్థితి జ్ఞాపకం వచ్చింది. కొడుకు కలెక్టరు— తను ఎంత తండ్రైనా రోడ్డులో నిలబెట్టి మాట్లాడటం కొడుకు హోదాకు, గౌరవానికి క్షేమం కాదు.

"ఆఫీసుకు వెళ్తున్నావా నాయనా. టయిమయిందేమో పోయిరా. నేనిక్కడికేలే—" అన్నాడు— 'నీదోవ నీవెళ్ళు' దోరణిలో అనటమేమిటి, కొడుకును జీపులో కూర్చోనేలా చేయటమేమిటి, తను వెళ్లటమేమిటి నిముషంలో జరిగేయి.

# మిల్క్‌మెయిడ్ వాడుట మీ నిత్యవిధిగా చెయ్యండి

CONDENSED MILK
MILKMAID BRAND
SWEETENED

తీపి అయిన మిల్క్‌మెయిడ్ గడ్డ పాలు కలిపి తీపి వస్తువులను చేస్తే అవి ఎక్కువ రుచిగానూ, ఎక్కువ పోషక వంతముగానూ వుంటాయి. వీటిని వాడుట ఎంతో సులభము. పైగా, మీరు పంచదారను పొదుపు చేయ గలరు. ఎందుచేత నంటే మిల్క్‌మెయిడ్ గడ్డ పాలలో శుద్ధి చేయబడిన పంచదార చేర్చబడినది.

ఈ రోజే 2 డబ్బాలు కొనండి! వాటిని మీరు ఎన్నో విధములలో వాడవచ్చును. మిల్క్‌మెయిడ్ అంటే శుద్ధమయినవి, తాజా అయిన మరియు రుచి అయిన పాలు!



ఇవి పండ్లతోను 'పుడ్డింగ్'తోను అమితం దివ్యంగా వుంటాయి




ఇవి కాఫీ, టీలకి మంచి రుచి ఇస్తాయి



ఇవి మీ పాపకు పరిపూర్ణమయిన పోషకము ఇస్తాయి

**ఇప్పుడు విరివిగా లభిస్తున్నాయి**

(తీపియైన మిల్క్‌మెయిడ్ గడ్డ పాలు—ఇవి ఉత్కృష్టమైనవని మీకు తెలియును, ఎందుచేతనంటే ఇవి నెస్లే వారి తయారీ!

# చెట్టుకింద ప్లీడరు

'చెట్టుకింద ప్లీడరు పంట పండిందిరోయ్—'

'కలెక్టరు నాయనకాదూ ఎలాగైనా?'

నవ్వులు—

'ఆ పాత గౌను తీసేస్తే చూడాలని వుందిరా ఆయన్ని—'

'ఆయన సంపాదనంతా ఆ బొంతలోనే దాచి పెట్టేట్టు!'

'ఇంకా ఎందుకు పాపం యీ ముసలాయనకీ చెట్టుకింద సేవ'

'అలవాటైన ప్రాణం కదుటయ్యా పాపం—'

వెంకట్రామయ్య చెవులు అన్నీ విన్నాయి. అయితే అతని మనసు మాత్రం వినవట్టే—

భానుమూర్తి కూడా త్వరలోనే తెల్సుకొన్నాడు—తన విషయం, తండ్రి విషయం చర్చనీయాంశంగా మారుతోందని—

'అయినా యెంత తండ్రైతేమాత్రం కలెక్టరయి వుండి అలా రోడ్డులో నిలబడి మాట్లాడటమేనా ?'

'పుత్రధర్మంరా బాబూ!..... పుత్రధర్మం—'

విన్న భానుమూర్తి నవ్వుకొన్నాడు. ఆ ధర్మమేమిటో వీళ్లకేం తెలుస్తుంది? అధికారం వచ్చినంత మాత్రాన, తలిదండ్రులమీద, పెద్దలమీద గౌరవం పోవాలా? వాళ్ల ఎదుటే విచ్చలవిడిగా ప్రవర్తించాలా!......అధికారానికి అర్థం అదికాదు.... నాగరికతకు తాత్పర్యం అదికాదురా బాబూ..... మన సనాతన ఆచారం, ధర్మంతా అది. దాన్ని మాత్రం మర్చిపోకూడదురాబాబూ .... అని అరిచి చెప్పాలనిపించింది భానుమూర్తికి.

ఆరాత్రి వ్వంత యింటి కెళ్లేడు భానుమూర్తి. తండ్రి యేదో 'లా'పుస్తకం చదువుతున్నాడు.

కొడుకును చూచి తండ్రి ఆహ్వానించాడు. కాస్సేపు మౌనం—

"నాన్నగారూ— ఇక మీరీ వద్దతిని మానెయ్యకూడదూ?"

'ఎందుకురా బాబూ? యిప్పుడేం వచ్చింది నాకు. ఒంట్లో ఓపిక వుంది. యింట్లో తోచమూతోచదు.

'హాయిగా 'కృష్ణారామా' అనుకొంటూ, ఏదన్నా పుస్తకాలు చదువుకొంటూ ప్రశాంతంగా వుండకూడదా నాన్నగారూ? యీ వయస్సులో మీకీశ్రమ ఎందుకు?'

వెంకట్రామయ్య స్వచ్ఛంగా నవ్వేడు. 'ఇంతేనట్రా నాయనా నీ కారణాలు? యింతేనా?' ఒక క్షణం సేపు మౌనంగా వుండి తిరిగి ఆయనే అన్నాడు మెల్లగా—

'నాకు తెల్సు భానూ. వీటికి తోడు యింకా కొన్ని కారణాలున్నాయి—'

'నాన్నగారూ' భానుమూర్తి హృదయం జాలిగా పిల్చింది.

'నాకు తెల్సునాయనా. నువ్వు కలెక్టరువు. నామీద ప్రేమకొద్దీ నాకు చెప్పకుండానే యీవూరు వేయించుకొని వచ్చావ్. కాని చూడు నాయనా యిక్కడే నువ్వు పొరపాటు పడ్డావ్. నా సుఖాన్ని, నీ దృష్టితోనే ఆలోచించావు కాని, నాదృష్టిలో ఆలో

చింతలేకపోయాక్—'

భానుమూర్తి తండ్రివైపు నివ్వెరపోయి చూచాడు.

'నీవు అనుభవిస్తున్న వేదనను నేనూహించగలను భానూ. నన్ను కాలు కదల్పనీయకుండా సేవ చేయాలని నీ అభిలాష. కానీ తిరిగిన కాలు నాయనా —కట్టివేస్తే కొట్టివేసినట్టే బాధపడ్తుంది. పెంచి పెద్దచేసి ప్రయోజకుడిని చేసిన మాకేమీ సుఖాన్ని ఇవ్వలేకపోతున్నానే, మా ఋణాన్ని తీర్చలేక పోతున్నానే అని నీబాధ. కానీ భానూ... ప్రతిఫలాన్ని కాంక్షించేదిట్రా తలిదండ్రుల ప్రేమ. నన్నంతా 'చెట్టుక్రింద ప్లీడరు' అంటారని నీ బాధ. అయితే భానూ.... అలా పిలుస్తే నేనెంత ఆనందిస్తానో నీకు తెలీదు. అది నా పేరురా. ఆ పేరులో నాకు ఆ చెట్టునీడకుగల అనుబంధం వుంది. ......ఆపాతకోటు వదలాలని అందరి లాగానే నీ ఆకాంక్ష. అయితే యిన్నాళ్లూ కొనుక్కోలేక కాదురా కోటు కుట్టించుకోంది— ఆకోటుమీద ప్రేమకొద్దీనని ఎవరికీ తెలియదు. ప్లీడరు బోర్డు తగిలించిన్నాడు తొడిగానా కోటును ప్రప్రథమంగా.ముప్పైయేళ్లు గడిచిపోయింది. అయితే యిన్నేళ్లలో గెలిచింది ఒకే ఒక్క కేసు. ఒక్క కేసు గెలిచిన ప్లీడరుకు పది కోట్లెందుకురా? మళ్లీ ఎప్పటికైనా ప్లీడరుగా కేను గెలవాలి. ఆకోటు మార్చాలి. లేదా ఆకోటుతోనే కడదేరిపోవాలి—"

భానుమూర్తి మనసులో ఎన్నెన్నో భావనలు..... హృదయానికెంతెంతో అనుభూతి...... మెదడుకెంతెంతో విజ్ఞానం.........

"నాయనా భానూ. పెద్దవాడిగా —అనుభవంతో పండిపోయి చెప్తున్నానురా. సంతోషం, ఆనందం అన్నవి ఎక్కడో లేవు. మన మనసుల్లోనే వున్నాయి. ఒకళ్లు మనల్ని ఏదో అంటున్నారని బాధపడేదానికన్నా, అది సత్యమైనప్పుడు స్వీకరించటం, అసత్యమైనప్పుడు తేలిగ్గా నవ్వివారేయటం నేర్చుకోవాలి. ఎవరో ఎగతాళి చేస్తారని మన పద్ధతుల్ని మార్చుకోవటం ఎందుకు? మన సంప్రదాయాలకు, అలవాట్లకు స్వస్తి చెప్పటం ఎందుకు? అనవియ్ బాబూ...... లోకంలో జనం లక్ష అనుకొంటారు. అందుకు బాధ పడ్తుంటే దానికి అంతెప్పటికి?"

భానుమూర్తికి జ్ఞానోదయమైనట్లయింది. తనెంత పొరపాటు చేశాడు. విషయాలను తనెంత వక్రంగా వూహించుకొన్నాడు? ...... చెట్టుక్రింద ప్లీడరుగా ఎగతాళి చేయబడే తండ్రి, జీవిత దృక్పథానికి కలెక్టరుగా గౌరవించబడే తన ఆలోచనలకి ఎంత వ్యత్యాసం వుంది?

ఆ విషయాలని గురించి ఆతర్వాత ఆలోచించటం మానేసేడు భానుమూర్తి.

అయితే జనం మాత్రం ఆ తండ్రీ కొడుకుల కథలను కరకాల వర్ణనలతో చెప్పుకో సాగేరు.

* * *

వెంకట్రామయ్య జీవితకథ అలాగే సాగిపోతే ఎలాగుండేదో? కానీ అలా సాగిపోలేదు. ఆయనకి మళ్లీ కేసులు రావటంతో కథ మరో మలుపు తిరిగింది.

ముప్పైయేళ్లతర్వాత తిరిగి కోర్టులోకివెళ్తున్నప్పుడు ఆయన గర్వాన్నికాని, సిగ్గునుకాని పొంద

లేదు. అదే నల్లకోటు వేసుకొని రోజూ కోర్టుకు పోయే వాడిలాగానే వెళ్లేడు.

కోర్టులోనేకాదు యివతల ఆయన పద్ధతి మార లేదు. శర్మపోయిన తర్వాత వెంకట్రామయ్య ఆయన స్థానాన్ని ఆక్రమించినా, యింకో ప్రైవేట్లు వ్యక్తి ఆయన పనులు చేస్తున్నాడు. కోర్టు కేసులొచ్చాక, ఆయన వెంకట్రామయ్య గుమాస్తా కూడా అయ్యాడు. అదే అన్నిటి ఆఫీసు. న్యాయమనుకొన్న కేసునే చేపట్టటం?

న్యాయానికాలం వచ్చినట్లుంది. వెంకట్రామయ్య పట్టిన మొదటి కేసుగెల్చింది. 'కలెక్టరు గారి నాయన కాదుట్రా?' అనుకొన్నారు గిట్టని వాళ్ళు. అయితే కేసులో ఆయన వాదనను విన్న వారుమాత్రం 'ఫర్వాలేదురోయ్— చెట్టుకింద ప్లీడరు కూడా బాగా వాదించగలడే' అనుకొన్నారు.

రెండోదీ గెలిచాడు. అయినా పాతకోటు. పాత స్థలం మారలేదు.

మూడోది వోడిపోయాడు. నాలుగోది.....

నాలుగోదాని దగ్గరే సందిగ్ధం వచ్చింది వెంకట్రామయ్యకు. ఆ కేసు న్యాయమైనదో, కాదో యిదమిద్ధంగా తేల్చుకోలేక పోయాడు. ఏమయితే నేం? ఆకేసూ గెలిచాడు కిందికోర్టులో. అవతల పక్షం వాళ్లు బాగా వున్నవాళ్లు. అప్పీలుకు పోయారు. మేజర్ అప్పీలు కావటంవల్ల కలెక్టరు దగ్గరికెళ్లింది.

ఇదివిని భానుమూర్తి బాధ పడ్డాడు.

'నాన్నగారూ.... యీ కేసునుంచి మీరు తప్పుకోండి' అన్నాడు.

'ఎందుకు?' ప్రశ్న.

మీ న్యాయ దృక్పథాన్ని, నిష్ఠను పరీక్షించి నిర్ణయించే అర్హత నాకు లేదు. అది నాకు సిగ్గు చేటు —చేతకాదు—'

నవ్వేడాయన— 'అది నీ బాధ్యత— యిది నా కర్తవ్యం. నేను వాదించాల్సిన వాడిని, నువ్వు తీర్పివ్వాల్సినవాడివి. మన ధర్మాన్ని మనం నిర్వర్తించటానికి సిగ్గుపడాల్సిన అవసరం లేదు. నీ కర్తవ్యం నువ్వు నిర్వహించు. స్వయం బుద్ధితో, తన మన అన్న ఆలోచనను విడనాడి, ధైర్యంగా నిర్ణయాలివ్వటం నేర్చుకోటం అవసరం—'

కేసు జరిగింది. రెండు పక్షాల వాదనలను విన్నాడు కలెక్టరు!

తీర్పిచ్చేవాడు కొడుకు. ఒకపక్షాన వాదించేవాడు తండ్రి. ప్రజల్లోకూడా కేసు పట్ల వుత్సాహం, ఆత్రుత కలిగింది.

తండ్రి ప్లీడరుగా రాణించక పోవటానికారణ మేమిటో బానుమూర్తికి వాదనలన్నీ విన్నాక తెల్సింది. ఆయనకి న్యాయ మొక్కటే తెల్సు. అన్యాయం అంటే ఏమిటో తెల్సినా దాన్ని గురించి ఆలోచించటం అధర్మమన్న నమ్మకం కలవాడు. అయితే, న్యాయ విషయాలతో పాటు, అన్యాయాలు కూడా తెల్సిన వాడే, దాన్తో పోరాడే నేర్పుగల వాడే, దాన్ని జయించ గలడు. లేకపోతే దాని చేతుల్లో వోటమి తప్పదు.

తనకి తెల్సిన న్యాయాన్ని ఖచ్చితంగా చెప్పగలడు కాని, అన్యాయాన్ని ఎదిరించి వోడించే నేర్పులేదు. అబద్ధం ఆడలేడు. అవతల సాక్షిచేత అబద్ధాన్ని చెప్పించే నేర్పసలులేదు. నిజానికి అబద్ధపు రంగు, అబద్ధానికి నిజపురంగునుపూసి, చిత్రించే నేర్పు బొత్తిగా లేదు.

ఆరోజు కేసు తీర్పివ్వాల్సినరోజు. కోర్టు జనంతో కిక్కిరిసి వుంది. గెలుపు వోటముల మీద పందేలు వేసుకొన్నారు కొందరు.

భానుమూర్తి అందరివైపు వో మారు చూచాడు. అందరికళ్లు అతనిమీదే కేంద్రీకృతమై వున్నాయి. అందరిలో అతనికనిపించంది వెంకట్రామయ్యే!

భానుమూర్తి కర్థమైంది— తండ్రి కావాలనే ఆరోజు రాలేదని, తను వస్తే కొడుకు కర్తవ్య నిర్వహణలో పొరపాటు చేస్తాడేమోనని వూహించి వుంటాడు. మనసులోనే ఆయనికి నమస్కరించాడు.

తీర్పు చదవటం అయ్యేసరికి అంతా నివ్వెర పోయారు. వెంకట్రామయ్య పక్షం వోడిపోయింది!

కొందరు భానుమూర్తి న్యాయనిష్ఠను పొగిడితే, మరికొందరు 'ఆ— యిదంతా నాటకం లే' అన్నారు.

ఆ సాయంత్రం జీపులో బంగళాకెళ్తూ యిదే విషయం ఆలోచిస్తున్నాడు భానుమూర్తి..... తండ్రికి న్యాయం తప్పని న్యాయవాదికావాలన్న కోరిక వుందని తనకు తెల్సు. ఇప్పుడీ కేసులో వోటమితో ప్లీడరుగా ఆయన భవిష్యత్తు తిరిగి చెట్టు క్రిందికి రావచ్చు. అయితేనేం? ......యిది ఓడిపోవటం వల్ల ఆయన నిజమైన న్యాయవాది అవుతాడు. అన్యాయాన్ని, తనకు తెలీకుండానే న్యాయమని వాదించిన ప్రథమకేసు యిదేనేమో ఆయన జీవితంలో. యిదే గెల్చి వుంటే ఆయన చేతులారా అన్యాయానికి ఆసరా యిచ్చినట్లు. ఓడి పోయినం దుకు ఆయన బాధపడ్తారో, సంతోషిస్తారో?....

జీపు బ్రేకుపడింది. కోర్టు ప్రక్కన చెట్టు క్రింద పాతపెంకుటింటి వద్ద జనం!

'పాపం— చెట్టు క్రింద ప్లీడరు గుండెనొప్పివచ్చి పడిపోయాట్ట!'

'ఆ—కేసు కొడుకు చేతిలో ఓడిపోయాడని తెల్సి—'

తెలివొచ్చాక, కన్నీళ్లతో కన్పించిన కొడుకును చూచి అన్నాడు వెంకట్రామయ్య— "ఏడుస్తున్నావా భానూ? ఎందుకు?...... జీవితంలో ఎన్నడూ పొందని సంతోషాన్ని యివాళే పొందేను. ఎందుకో తెల్సా? నా కొడుకు నాకన్నా న్యాయనిష్ఠ కలవాడని తెల్సుకొని!.... ఆ సంతోషాన్ని హృదయం దాచుకోలేక పోయింది. అందుకే బాబూ యీ హార్టు ఎటేక్! ఎవరన్నా కేసు ఓడిపోయానని తెల్సి యీ ఎటేక్ వచ్చింది, అనుకుంటే వాళ్లను చూచి జాలిపడు— నిజంగా యీవాళ నాకెంతో ఆనందంగా వుంది....."

ఆ మరుసటిరోజు ఆ సెంటర్లో పెద్ద వేపచెట్టు కింద పాత పెంకుటింట్లో ముసలి కుర్చీలో 'చెట్టు కింద ప్లీడరు' కన్పించలేదు. ఆ సెంటరు సెంటుకే బోసి పోయింది! వేప చెట్టు విషాదంగా తలవూపింది.

ఆనాడు గాని ఆయన విశిష్ఠతను తెల్సుకోలేక పోయారు ఆ ఊళ్లోని చాలామంది మనుష్యులు! ●

ఓహో తెలిసింది! ఇవి గత సంవత్సరం మంత్రిగారు ప్రారంభోత్సవం చేసిన కట్టడాలు!






# వారఫలం

## 27-12-1968 శుక్రవారం మొదలు 2-1-1969 గురువారం వరకు

**మేషం:** మీ చాకచక్యమే అన్ని వ్యవహారాల్లోను అనుకూలతను సాధించ గలదు. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయుగలరు. విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. సాటివారిలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం :** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు ఏర్పడి తరువాత సర్దుకొంటాయి. మీతాలూకు వస్తువులు పోయేప్రమాదం ఉంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**మిథునం :** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో ఆకస్మికంగా చికాకులకు గురి కాగలరు. వృత్తిలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉండదు. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కర్కాటకం :** వ్యాపారంలో ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభించగలవు. విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**సింహం :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీ కృషి ఫలిస్తుంది.

**కన్య:** కొన్ని వ్యవహారాల్లో మీరు శ్రమపడినా ప్రయోజనం ఉండదు. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల :** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం** ఇతరుల మీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. వృత్తిలో సాటివారితో పోటీ పెరుగుతుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణాలు కొంచెం శ్రమమీద ఫలిస్తాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు బాగా ఉంటాయి. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**ధనుస్సు :** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. సాటివారితో మాట పట్టింపులు తగవు. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మకరం** సామాన్యమైన పనులకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసివస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగా ఉంటాయి. వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. స్థిరాస్తి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు శ్రమమీద ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం :** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

—మహేష్ ●

# లిలీ

పేరు
శ్రేష్ఠతకు గుర్తు




లిలీ బిస్కెట్లు
మేలు రకము
బిస్కెట్లు

రుచికి,
సువాసనకు
పేరుపొందినవి



లిలీ బిస్కెట్ కంపెనీ ప్రై॥ లి॥
కలకత్తా-4.
ఆంధ్రకు డిస్ట్రిబ్యూటర్లు:
ట్రేడ్ ప్రమోటింగ్ కార్పొరేషన్
విజయవాడ.



లిలీ కొనడమే మంచిది

## కొత్త సీరియల్ ప్రారంభం

# సురేఖా పరిణయం

సీరియల్



"సురేఖా! గుడ్ న్యూస్ – నీకు ఉత్తరం
దిగివస్తూ మెట్లమీద నిలబడే స్నేహితురాలితో చెప్పి
ఇంటిదగ్గరనుంచి వుత్తరమే లేదని, పదిరోజులగా
తెలుసు. కవరు వెనక సురేఖ తండ్రిపేరూ, వూరూచ
స్నేహితురాలికి అందించేసింది.

"ఓ–థ్యాంక్సు" చిన్నగా నవ్వింది సురే

"ఆ థ్యాంక్సు మధ్యా నాకా!"

"వ్రాసినందుకు వాళ్లకీ వున్నాయిలే–ముందుగా

"మహారాజులా పుచ్చుకుంటాను - అ-చెప్పటం

కృష్ణట, వచ్చి వెళ్లారు.

"డాక్టరు రామకృష్ణ!" కదల బోయిన సు
గొంతులో అపక్తిని ఆశ్చర్యాన్ని అర్థం చేసుకోగలిగిన శ్యా



ఉన్నవ విజయలక్ష్మి

శచ్చింది.'' డాబామీదనుండి క్రిందికి
ంది శ్యామల - వాళ్లిద్దరూ రూమ్‌మేట్సు -
సురేఖ రోజూ అనుకోటం శ్యామలకి
గాసింది కనక ఆ శుభవార్త ముందుగా

ఖ కారిడార్‌లోనే ఆగిపోయి.

చెప్పినందుకు నీకూడ ఇస్తున్నాను"
మరచిపోయాను. మీ కజిన్, డాక్టరు రామ

రేఖ మళ్లీ ఆగిపోయింది." ఆ అమ్మాయి
బల,

"ఆ. అవును. ఎవరతను ?" అంది వయ్యారంగా రేలింగు వానుకుని, కుతూహలంగా సురేఖ మొహంలోకి చూస్తూ.

'మా అత్తయ్యకొడుకు.' అంటూ తల ప్రక్కకి తిప్పేసుకుంది సురేఖ.

'ఓహో—మళ్లీ ఓ అరగంటలో వస్తానన్నారు—ఇవాళ నువ్వురావటం ఆలశ్యం అయిందేం ?'—శ్యామల గొంతులో చిలిపితనం తొంగి చూసింది—అయినా అడిగిన ప్రశ్నకి సమాధానం ఆశించకుండా చిన్నపిల్లలా చెంగుచెంగున మెట్లు దిగుతూ గబగబ క్రిందికి వెళ్లిపోయింది.

శ్యామల వుల్లాసానికి కారణం సురేఖకి తెలుసు. తను గేటుదాటి లోపలికి వస్తూంటే ఓకారు వెనకే వచ్చి ఆ అమ్మాయిని దాటుకుని ముందుకి వెళ్లిపోయి ఓ ప్రక్కగా ఆగింది — ఆ నల్లరంగు ఫియట్ కారునీ, అది డ్రైవ్ చేసుకుంటూ వచ్చే వ్యక్తినీ సురేఖ గుర్తుపట్టకలదు—అతను శ్యామలా వాళ్ల మామయ్య మాధవరావు—అతను అదేదో లేబరేటరీలో సైంటిఫిక్ ఆఫీసరనీ, నెలకి వెయ్యి రూపాయిలపైనే జీతం వస్తుందనీ, శ్యామలే చెప్పింది ఓసారి—శ్యామల ఉద్యోగంలో చేరిన ఈ నాలుగైదు నెలలనుంచి
● వుమెన్సు హాస్టలుకి వచ్చే లెక్చరర్

# సురేఖాపరిణయం

విజటర్సు సంఖ్య ఒకటే పెరిగింది.

అతను ఏ నాలుగు రోజులకో ఓసారి వస్తాడు. కాని, శ్యామలమాత్రం పాపం ఇంచుమించు ప్రతిరోజూ సాయంకాలం అంతా అతనికోసం కళ్ళు కాయలు కాచి పోయేటట్లు ఎదురు చూస్తున్నట్లే అనిపిస్తుంది—ఆఫీసునుంచి రాగానే ఆదరా బాదరా టిఫిన్, కాఫీ తీసుకుని అప్పుడు సావకాశంగా స్నానం చెయ్యటమో లేకపోతే మొహం కడుక్కోటమో అయ్యాక తీరుబడిగా ముస్తాబవటం మొదలు పెడుతుంది. అసలే అందంగా వుండే శ్యామల అంత ఓపికగా సింగారించుకుని చూడ ముచ్చటగా తయారయేసరికి సురేఖకి ఒక్కోసారి కాస్త అసూయలాంటిది కలుగుతూంటుంది—ఆడవాళ్ళకి అందమే ఓ ఆభరణం అనుకుంటూంటే ఆమెకి తెలియకుండానే గుండెలలో నుంచి ఓ నిట్టూర్పు పుట్టుకువస్తుంది—

అలా అలంకరించుకున్న శ్యామల డాబా మీదికి వెళ్ళి కూర్చుంటుంది చేతో ఓ నవల ఏదో పట్టుకుని—ఎవరూ డిస్టర్బు చెయ్యకుండా హాయిగా చల్లగాలితో కూర్చుని చదువుకుంటానని చెప్పటం ఓ సాకు మాత్రమే అనీ, ఆ అమ్మాయి దృష్టి చేతిలో వున్న పుస్తకం మీదకంటె రోడ్డు మీద వచ్చే పోయే కార్లమీదే వుంటుందనీ, మధ్యమధ్య పుస్తకం మూసి వేసి పిట్టగోడవార నిలబడి ఆసక్తిగా రోడ్డుమీదికి చూస్తూంటుందనీ సురేఖ గ్రహించేసింది.

ఆమాటే నవ్వుతూ అనేసిందికూడ ఓసారి—శ్యామల బిడియంగా నవ్వేస్తూ చటుక్కున మొహం తిప్పేసుకుంది — ఆ అమ్మాయి చెక్కిళ్ళలో ఎర్ర గులాబీలు విచ్చుకోటం మాత్రం సురేఖ దృష్టిని తప్పించుకోలేక పోయాయి—

'ఇంక ఇంతకన్న స్పష్టంగా ఏ ఆడపిల్ల మాత్రం చెప్తుంది—ఇంకా పెళ్ళెప్పుడు చేసుకుంటారో — అందాకా ఈ అమ్మాయి నిరీక్షణ తప్పదు.' అనుకునేది.

'అయినా విజటర్సు వస్తే ఆయా వచ్చి చెప్పదా? క్రిందనుంచి ఈ మొదటి అంతస్తుకి రావాలంటేనే నాకు కాళ్ళు పీక్కు పోతాయి—అలాంటిది పని వున్నా లేకపోయినా పదిసార్లు పై డాబామీదికి కూడ వెళ్ళివస్తుంది. ఈ పిల్ల ఓపికకి మెచ్చుకోవాల్సిందే' అనుకుంటూ గది తలుపులు తెరుచుకుని లోపలికి వెళ్ళింది—పర్సూ, కర్చీఫూ టేబిలుమీద పడేసి అక్కడున్న కవరు అందుకుని స్త్రరున ఓ చివర చింపి ఆత్రంగా వుత్తరం పైకి తీసింది—నాలుగు పంక్తులు చదివేసరికే ఆ అమ్మాయి మొహం ఎలాగో అయిపోయింది.

'పెద్దక్కయ్యకి వంట్లో బాగుండటం లేదు—ఆ వూళ్ళో ఎన్నిమందులు వాడినా లాభంలేక పోయేసరికి పదిహేను రోజుల క్రిందట ఇక్కడికి తీసుకొచ్చాడు మామయ్య—పెద్దాసుపత్రిలో చూపించాం. ఆపరేషను చెయ్యాలి అంది డాక్టరు—ఈ రోజుల్లో అదొక పెద్ద భయం కాకపోయినా అక్కయ్య ఏడుస్తూ కూర్చుంది—మరో డాక్టరుకి కూడ చూపించాం. ఏవో మందులు వ్రాసి ఇచ్చింది — వాటికి తగ్గకపోతే ఆపరేషన్ చెయ్యాల్సిందేనుట—ఈ జబ్బుతోటీ బెంగతోటీ అది అలా చీపురుపుల్లలా అయిపోయింది—ఏమిటో ఇంట్లో ఎవరికీ మనస్సులు కుదురుగా లేవు—అందుకే వుత్తరం వ్రాయటం ఆలశ్యం అయింది.' అంటూ జబ్బు విషయాలూ అవీ వ్రాసింది ఉమ.

ఇంట్లో ఎవ్వరికీ మనస్సులు కుదురుగా లేవు అన్న అక్షరాలే కళ్ళ ముందు నిలిచి పోయినట్లుగా అయిపోయింది సురేఖకి — ఏమీ భయం లేకపోతే ఇలా వుత్తరం వ్రాస్తుందా—

ఎప్పుడూ సందడిగా మాట్లాడుతూ గవ్వలు గిలకరించినట్లు నవ్వుతూ ఒంటెడు నగలతో లక్ష్మిదేవిలా కళకళలాడుతూండే అక్కయ్య కళ్ళల్లో మెదిలింది—'తను ఆట్టే చదువుకోలేదు. మామయ్యా ఎక్కువ చదువుకోలేదు, పల్లె

---

డాక్టర్ కబుర్లు

## ఎండలో గుండె

అమాంతంగా ఎండ దెబ్బ తగిలితే గుండెకి ప్రమాదం రావచ్చు.

బయటి వాతావరణం వేడిగా తేమగా తయారవగానే ప్రశాంతంగా విశ్రాంతి తీసుకుంటున్న



ఒకవ్యక్తి గుండె బాగా హుంయిరాను పడుతుంది. అప్పుడు ఆ గుండె పరిస్థితి ఎంతో శరీరశ్రమకి లోనయిన గుండె పరిస్థితిలాగ ఉంటుంది.

గుండెజబ్బు ఉండేవారికి ఎండ వేడి మంచిది కాదన్నమాట.

అయితే ఈ బాధ వేడి హాటాత్తుగాఎక్కువ అయితేనే వస్తుంది. క్రమంగా ఎండలు అధికం అయితే పరవాలేదు. వడదెబ్బలు చాలా ఇటువంటివే...

వీలయితే ఎయిర్ కండిషనింగు లేక ఫాన్‌లు పెట్టుకుంటే మంచిది.

చేతులని, కాళ్ళని అయిస్‌తో రాస్తే—లేదా చల్లని తడిగుడ్డలు కప్పితే—గుండెకి ప్రయాస తగ్గుతుంది. (చర్మం చల్లబడితే గుండెకి అంత కష్టపడ నవసరం ఉండదు.)

బాగా ఎండ ఉన్నప్పుడు దేహంలోని నీరు తగ్గేమందులు తినరాదు. ఉప్పులేని ఆహారం కూడా తినరాదు. చెమట పట్టేనకొద్దీ ఉప్పు అవసరం అధికం.

హెచ్. ఎల్. హార్విన్‌సొన్

(కాపీరయిటు)

# ఆ స్వచ్ఛమైన
# మనోహరమైన తెల్లతనానికి




లయన్ బ్రాండ్

## విక్టోరియా బ్లూ ఒఒబి (OOB)

(ప్రశస్తమైన ముదురు నీలం)

అవును, కొంచెం విక్టోరియా బ్లూ ఒ.ఒ.బి మీ తెల్ల బట్టలకు అద్భుతమైన ప్రత్యేకత నిస్తుంది! వాటికి మిఱుమిట్లు కొలిపే తెల్లతనాన్ని చేకూర్చుతుంది. మీ చొక్కాలకు, చీరెలకు, దుప్పట్లకు ఆటివచ్చే విధంగా అదనపు తెలుపునిచ్చే పద్ధతి!



తయారుచేయువారు: అల్ట్రామరైన్ అండ్ పిగ్మెంట్స్ లిమిటెడ్ అంబత్తూర్, మద్రాస్-53.

సోల్ సెల్లింగ్ ఏజంట్సు: కెంప్ షైన్ ట్రేడింగ్ కంపెనీ, 318, లింగి శెట్టి స్ట్రీట్, మద్రాసు-1.

# సురేఖాపరిణయం

టూరిలో కాపురం—అయినా ఆ విషయా లేవీ ఎప్పుడూ కూడ తను ఆలోచించి నట్లే అనిపించదు — మొగుడికీ పిల్లలకీ వేళ్టికి ఇంత వండిపెడుతూ వాళ్ల ఆలనా పాలనా చూసుకోటం కంటె ఆడదాని జీవితానికి మరో అర్థం పరమార్థం లేదను కొనే తత్వం తనది — పట్టుమని పది రోజులు పుట్టింట్లో వుండటానికే ఇదయి పోతుంది—'

'అదేమిటే ఇంకా అలాగే కూర్చున్నావు— త్వరగా మొహం కడుక్కుని తయారవు—' సుడిగాలిలా గదిలోకి వచ్చిన శ్యామల స్నేహితురాలిని హాస్యం చెయ్యబోయింది. కాని ఆమె వుత్సాహంగా లేకపోవటం చూసి తెల్లబోతూ.

'అలా వున్నావేం — ఏం వ్రాశారు,' అంది.

'మా అక్కకి వంట్లో బాగుండ లేదుట,' అంది సురేఖ వుత్తరంలోకి చూస్తూ.

'సుస్తీ ఏమిటట.' శ్యామల గొంతులో సానుభూతి నిండి వుంది—సురేఖ చెప్పింది వింటూ, 'ఎక్కడో పిచ్చిదానిలా వున్నావే— ఆపరేషన్ పేరు వినగానే అలా బెంగపెట్టు క్కూర్చున్నావా? అరికాల్లో గుచ్చుకున్న ముల్లు తీసిపారేసినంత అవలీలగా చేసేస్తున్నారు ఈ రోజుల్లో ఆపరేషన్లు — నేను చెప్తున్నాను— మీ అక్కకేం భయం లేదు,' అంది.

'మా కందరికీ కావలసిందదే,' అంది సురేఖ. ఆమె గొంతు బరువుగా వుంది.

'నీ మనస్సేం బాగుండలేదు కదూ...' దగ్గరగా వచ్చి స్నేహితురాలి బుజం మీద అనునయంగా చెయ్యివేసింది శ్యామల — మామయ్య సినిమాకి రమ్మంటున్నాడు — పోనీ మానేసి నీ దగ్గరుండిపోనా —' అంది, ఆ స్థితిలో స్నేహితురాలిని ఒంటరిగా వదిలేయలేని జాలితనం, అటు మామయ్యతో సరదాగా కాలం గడిపే అవకాశం పోగొట్టుకోలేని బలహీనత కూడా వున్నాయి ఆమె జాలి చూపుల్లో.

'వద్దులే— మానేయటం ఎందుకు — వెళ్లిరా'—

'అన్నట్లు మీ బావ వస్తాడుగా ఇప్పుడు— మీరిద్దరూ కూడ ఏ సినిమాకయినా వెళ్లి పోండి— బెస్టు ఫరెవేంటి.' తన సమయస్ఫూర్తికి తనే మురిసిపోయి, 'అయితే నే వెళ్తున్నా—నాకోసం ఏం వుంచక్కర్లేదు. ఏకంగా భోజనం చేసే వస్తా,' అంటూనే అలమారులో వున్న హ్యాండుబేగు అందుకుని హుషారుగా వూగించుకుంటూ వెళ్లి పోయింది.

ఒకసారి వెళ్లి అక్కని చూసివస్తేనో అనిపించింది సురేఖకి. 'ముందేదో వాడు తోందిటగా—ఏమైనా పని చేసిందేమో— వ్రాసి కనుక్కుంటేనో,' అనుకుంటూ లేచివెళ్లి కాగితం కలం చేతిలోకి తీసుకుంది.

'ఆపరేషను అంటే భయమే లేదంటుంది శ్యామల — నిజమే నేమో— ఈ రోజుల్లో ప్రతిదీ ఎంతో తేలికయిపోయింది' అనుకోబోతూంటే చటుక్కున వాళ్ల పొరుగింటి సావిత్రమ్మగారు మనస్సులో మెదిలింది. ఏమిటో నలతగా వుంటోంది అనుకుంటూనే నాలుగు రోజులు అశ్రద్ధచేసి అయిదోనాడు అన్నం అదీ వండిపెట్టి పది గంటల వేళ ఆస్పత్రికి వెళ్లింది వూరికే చూపించుకు రావాలని. వ్యాధి లోపల్లోపల చాలా ముదిరిపోయిందనీ వెంటనే ఆపరేషను చేయించుకోవాలనీ — అవాళే ఆస్పత్రిలో చేరిపోతే రెండురోజులు అన్ని పరీక్షలూ చేసి ఆపరేషను చేస్తాననీ చెప్పింది డాక్టరమ్మ. అది వింటూనే ఆవిడ ఏడుస్తూ కూర్చుంది. మొగుడూ పిల్లలూ ఇరుగూ పొరుగూ అంతా ధైర్యం చెప్పి మర్నాడు ఆస్పత్రిలో చేర్పించారు — మూడోనాడు కాబోలు ఆపరేషన్ చేశారు — అంతే—'

సురేఖ ఒళ్లు జలదరించింది. కళ్లు చెమ్మగిల్లాయి. 'భగవంతుడా మా అక్కకి అలాంటి పరిస్థితి రానివ్వకు.' అనుకుంటూ వేయి దండాలు పెట్టుకుంది. మనస్సు ఇటూ అటూ పరుగులు పెడుతూంటే కాగితంమీద కలం పెట్టటం సాధ్యం కాలేదు.

'సురేఖమ్మా—మీ కోసం ఎవరోవచ్చారు' నరసమ్మ మాటలు వినిపించాయి.

'బావే అయివుంటాడు. తనకీ వుత్తరం చూపిస్తాను.' అనుకుంటూ, 'నేను రెండు నిమిషాల్లో క్రిందికి వెళ్తాను. రెండు కప్పుల కాఫీ తెచ్చిపెట్టు అక్కడికి.' అని చెప్పి సోపు బాక్సు, టవలూ తీసుకుని హడావిడిగా బాత్‌రూమ్‌వేపు వెళ్లిపోయింది — అక్క సంగతి బావని అడుగుతాను అన్న వూహే పగం దిగులు తీరిపోయేలా చేసింది.

'హలో, లెక్చరర్‌గారూ, ఎలావుంది హాస్టల్ లైఫ్', నవ్వుతూ అతనే ముందు పలకరించాడు లోపలికి అడుగు పెడుతున్న సురేఖని.

'హాస్టల్ లైఫ్‌కేం, దివ్యంగా వుంది—నువ్వు చెప్పు నీ ప్రాక్టీసు ఎలా వుందో—పనిమీద వచ్చావా ఈ వూరు.' సరసమ్మ చేతిలో ట్రే అందుకుని టీ పాయ్‌మీద పెట్టి ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

'నా ప్రాక్టీసూ దివ్యంగానే వుంది — మెడికల్ కాన్ఫరెన్సుకి వచ్చానిక్కడికి — మూడురోజులనుంచీ ఆ హడావిడితోనే సరిపోయింది — సాయంకాలంతో అదీ అయిపోయింది—రాత్రి రైల్లో వెళ్ళిపోవా లనుకుంటున్నాను—ఇందాక వస్తేనూ నువ్వింకా రాలేదని...'

'అవునట—మారూమ్ మేటు శ్యామలే—చెప్పింది—కాఫీతాగాక ఈ వుత్తరం చదివి సలహా చెప్పాలి. కన్సల్టేషను ఫీజుమాత్రం ఇవ్వమలే— కాఫీకప్పు.' అందిస్తూ అంది.

'డాక్టర్ని చూసేసరికి సలహాలు కావలసి వస్తాయిలా వుంది—వుత్తరం ఎవరు వ్రాసింది, ఇలాతే.' ఉత్తరం కోసం చెయ్యి జాచాడు.

* * *

సురేఖ తండ్రి రమణమూర్తిగారు ప్లీడరు— తండ్రి దగ్గర నుండి వారసత్వంగా వచ్చే ఆస్తితోపాటు కేసులు కూడ వస్తాయని 'లా' చదివాడేకాని తీరా ప్రాక్టీసు పెట్టాక తను ఆ వృత్తిలో బొత్తిగా రాణించలేనని తెలుసుకున్నాడు. అయినా కట్టిన బోర్డు తీసేయదలుచుకోలేదు ఆయన—'ఏదో ఓమాదిరిగా వస్తోంది. నాకేం లక్షలు గడించాలనే పెద్ద పెద్ద ఆశలులేవు. ఇప్పుడు హాయిగావే వుంది.' అంటూ బింకంగా పైకి ఖబుర్లు కూడ చెప్పేవాడు. అతని భార్య మాత్రం వాళ్లాయన సంపాదనని గురించి గొప్పగా చెప్పుకుంటూ ఏనాడూ నెలకి వెయ్యిరూపాయలకి తక్కువ కాలేదన్నట్లే మాట్లాడుతుంది—అసలు సంగతి గ్రహించగలిగిన వారు మాత్రం చాటుగా నవ్వుకుంటూండేవారు ఆవిడ మాటల్ని తలుచుకుని—

పెద్ద పెద్ద పార్టీలు ఒక్కొక్కరే మరో లాయరుగారిని వెతుక్కుంటూ పోతున్నా, తండ్రి గడించి ఇచ్చింది వుంది కదా అనే

# సురేఖాపరిణయం

ధీమాతో విశ్రాంతగా వుండేవారు రమణమూర్తిగారు. తన ప్రయోజకత్వం మీద తనకే నమ్మకం లేని స్థితిలో అంతకన్న ఆయన చెయ్యగలిగింది ఏమీలేదు — రాను రాను సంసారం పెరగటం — దానికి తగినట్లు సంపాదన లేకపోవటంతో క్రమంగా ఆస్తి కరగటం ప్రారంభించింది.

ఆయనకి నలుగురు కూతుళ్ళు ముగ్గురు కొడుకులు — పెద్దకూతురు కామాక్షిని స్వంత బావమరిదికే ఇచ్చాడు — తరువాత వాడు సుబ్బారావు ఇంజనీరింగు ప్యాసయి భిలాయిలో పనిచేస్తున్నాడు.

'చెల్లాయిల పెళ్ళిళ్ళు అయితేనే కాని నేను పెళ్ళిచేసుకోను' అని మొదట్లో అన్నాడే కాని తీరా ఉద్యోగంలో ప్రవేశించాక అక్కడి హోటలు భోజనం కొద్దిరోజులు తినే సరికే హడలుపుట్టి ఇంటి భోజనంకోసం మొహం వాచివట్లయిపోయాడు. అందుకే ఓసారి శలవలకి వచ్చినప్పుడు తల్లీ తండ్రీ చూపించిన అమ్మాయిని వద్దనకుండా బుద్ధిగా తాళి కట్టేశాడు —

ఆ తరువాతిది సురేఖ. ఎమ్మే ప్యాసయింది. ఇరవై అయిదేళ్ళు నిండిపోయాయి — కాలేజీలో లెక్చెరరు.

సురేఖకంటె మూడేళ్ళు చిన్నది ఉమ, తరువాత ఊర్మిళ — ఊర్మిళ తరువాత సుందరం, సూర్యం.

చామనచాయ రంగు, కోలముఖం, సామాన్యమైన రూపురేఖలు — చూడగానే కళ్ళని ఆకట్టుకునే అందం కాదు సురేఖది. ఆ పిల్లమొహంలో కనిపించే కళ అంతా విజ్ఞానాన్నీ జిజ్ఞాసనీ నింపుకున్న ఆ విశాలమైన నేత్రాలలోనే వుంటుంది — ఉమా, ఊర్మిళా తల్లిపోలిక పుణికి పుచ్చుకున్నారేమో ఆడవాళ్ళకే ముద్దొచ్చే సౌందర్యం వాళ్ళది.

కామాక్షినిగురించి ప్రత్యేకం చెప్పటానికి ఏమీ లేదుకాని, అసలు అందచందాల ప్రసక్తి లేకుండానే ఆ పిల్ల మేనమామ రాఘవరావు కోసమే పుట్టింది అన్నట్లు ముచ్చట పడిపోయారు అమ్మమ్మా తాతగారూ—థర్డుఫారం ప్యాసు కాగానే మరింక స్కూలుకి పంపించకుండా అక్షణంగా పెళ్ళిచేసి అత్తవారింటికి పంపించేశారు, ఆ ముసలివాళ్ళ కోరిక మేరకు—అందుచేతం రమణమూర్తిగారికి అల్లుడ్ని వెతకటమే అంటె ఏమిటో అనుభవంలోకి రాలేదు.

రమణమూర్తిగారి పెద్ద చెల్లెలు రుక్మిణి. ఆవిడ మొగుడు ఉమామహేశ్వరంగారుకూడ ప్లీడరీ చదివి, బోర్డు కట్టుకుని కొన్నాళ్ళు ప్రాక్టీసు చేశాడు. కాని, గుమస్తాకి జీతం ఇవ్వటానికి కూడ సరిపడే సంపాదన లేకపోవటంతో కొద్దిరోజులకే విసుగొచ్చింది.

'ఎవరి చేతి క్రిందా ఉద్యోగం చెయ్యకుండా స్వతంత్రంగా బ్రతకాలి.' అనే ఆదర్శానికి తిలోదకాలిచ్చి వీళ్ళకాళ్ళు వాళ్ళ కడుపులు పట్టుకుని ఎలాగో మునసబుగా సెలక్టు అయ్యాననిపించు కున్నాడు — ఆ తరువాత అదృష్టమూ కలిసివచ్చింది—ఇప్పుడు జడ్జీ పదవిలో వున్నాడు.

ఆ దంపతులకి ఒక్కడే సంతానం. అతనే రామకృష్ణ—ఉన్న ఒక్కడికీ పెద్ద చదువు చెప్పించాలనే సరదాతో అయిదు వేలుపెట్టి మెడిసిన్‌లో ఓ సీటు సంపాదించారు. ఉమా మహేశ్వరంగారు—మొగపిల్లవాడిమీద ఖర్చుపెట్టిన డబ్బు ఎక్కడికి పోతుంది? సీటు కోసం ఖర్చుపెట్టిన అయిదువేలు, అబ్బాయి డిగ్రీ చూపించి మరో అయిదు వేలు, తన జడ్జీహోదా చూపించి ఇంకో అయిదువేలు, తన ఆస్తికంతటికీ ఏకైక వారసుడు అనే ఆకర్షణతో మరో అయిదువేలు, ఇలా లెక్కలు వేసి ఎంతలేదన్నా ఇరవైవేలయినా కట్నం రూపంలో రాబట్టలేక పోతానా అని వూహల్లుకుంటూండే వారు ఆయన — కాని ఆయన ఆలోచనల నన్నింటినీ తారుమారు చేసేసింది రుక్మిణమ్మగారి ముచ్చట.

'తనకు వున్నంతలో ఏ లోటూ చెయ్యడు అన్నయ్య—అయినా ఇవాళ వాళ్ళు ఓ పది వేలు ఇస్తే మాత్రం కూర్చుంటాయా ఏమిటి.' అంటూ తన మనస్సులో కోరిక మెల్లిగా బయటపెట్టింది ఓ రోజు

'మనకి డబ్బులేకనా కట్నం తీసుకోటం అదొక ముచ్చట, హోదా అంతే— ఫలానా జడ్జీగారి అబ్బాయికి ఇంతకట్నం ఇచ్చారూ అంటే—అహ, రహస్యంగానే అనుకో — మనకి ఎంత దర్జాగా వుంటుందో ఆలోచించు—ఆ కట్నం డబ్బులు మూటకట్టి బ్యాంకిలో వేసుకోవాలనే కక్కుర్తి నాకేం లేదు — వాళ్ళిచ్చిన దానికి మరో పదివేలు

కలిపి మరీ ఖర్చుచేస్తాను మహారాజులా—' అంటూ దర్పంగా కళ్ళు ఎగరవేశాడు ఆయన.

'అదే నేను చెప్పేదీను — డబ్బు దాచుకునే ఉద్దేశ్యమే లేనప్పుడు అసలు పుచ్చుకోటం మాత్రం ఎందుకూ అని — ఆ డబ్బు కాస్తా ఆనాడే ఖర్చయిపోయినా, ఇన్నివేలు కట్నం తెచ్చాము అన్న అహం మాత్రం కలకాలం వుండిపోతుంది వాళ్ళల్లో...మొన్నటికి మొన్న ఆ నాయుడిగారి కోడలేం చేసిందో తెలిసిందిగా— ఆవిడ నాతో చెప్పుకుని ఒకటే ఇదయిపోయింది పాపం — ఓ రోజు వంటవాడు రాలేదుట, అవాళ ఆవిడికి జలుబు భారంగా వుండి ఆ పూటకి కోడల్ని చెయ్యమందిట వంట— ఆ పిల్ల పుట్టింట్లో పదిమంది నౌకర్లూ చాకర్లూ వంటవాళ్ళూ అంతా వుండటంతో ఏ పనీ చెయ్యటం అలవాటు కాకపోయినా ఎలాగో వండి పడేసిందిట— తీరా భోజనాలకి కూర్చున్నాక ఆ పదార్థాలు నోట పెట్టుకోలేక మరుదులూ వాళ్ళూ ఏదో హాస్యం చెయ్యబోయారుట — అక్కడికీ ఆవిడ కోడల్ని వెనకేసుకు వచ్చి ఏదో సర్ది చెప్తూనే వుందిట —అయితేనేం, ఆ పిల్ల రోషంగా 'నేనేం గతిలేక రాలేదు మీ ఇంట్లో అడ్డమయిన చాకిరీ చెయ్యటానికి. మా నాన్న యాభైవేలు కట్నం ఇచ్చి మరీ పంపించాడు నన్ను' అంటూ సమాధానం చెప్పటం దాంతో మాటకి మాట పెరిగి చివరికి పదిరోజుల్లో ఆస్తుల పంపకం వేరే వుండటం దాకా వచ్చిందిట—అంతా అలా వుంటారని కాదనుకోండి —మనకా ఒక్కగానొక్కడు. ఈ ఉద్యోగం వున్నన్నాళ్ళు ఇక్కడా అక్కడా తిరిగినా రిటైరయ్యాక వాడ్ని విడిచి వుండలేం కదా—స్వంత మేనగోడలే అయితే కాస్త ఇటూ అటూ అయినా సర్దుకుపోతాం— అయినా ఇప్పుడు మనకేం తక్కువ. ఆ కట్నం డబ్బులు పుచ్చుకోకపోయినా దర్జాగా పెళ్ళి చెయ్యగలిగే స్థితిలోనే వున్నాం — మనలాంటి వాళ్ళం అయినా కాస్త మంచీ చెడ్డా ఆలోచించకపోతే ఈ కట్నాల బెడద ఇలా పెరిగిపోతూనే వుంటుంది, ఆడ పిల్లలు కలవాళ్ళు అతలా కుతలం అయిపోతూనే వుంటారు.' అంటూ ఆదర్శాలు కలబోసి తన కష్టసుఖాలు ఏకరువు పెట్టిందావిడ.

(ఇంకా ఉంది)

# ప్రొఫెసర్ డి. యన్. వాడియా

భూగర్భశాస్త్రంలో (జియాలజీ) ఎఫ్. ఆర్. ఎస్. గౌరవాన్ని పొందిన భారతీయుడు ప్రొ. డి. ఎన్. వాడియా ఒక్కరే. అంతేకాదు. అంతర్జాతీయ భూగర్భ శాస్త్ర మహాసభకు అధ్యక్షత వహించిన భారతీయుడు కూడ ఈయన ఒక్కరే. మొదటిసారిగా మనదేశంలో 22వ అంతర్జాతీయ భూగర్భ శాస్త్రమహాసభ 1964లో కొత్త ఢిల్లీలో జరిగినప్పుడు ఈ గౌరవం ప్రొ. వాడియాకి దక్కింది. ప్రొ. వాడియా కేవలం స్వయం కృషివల్ల పైకి వచ్చిన శాస్త్రవేత్త. ఆయన విద్యాభ్యాసం అంతా భారతదేశంలోనే సాగింది. ప్రస్తుతం అణుశక్తి కమిషన్‌కి సలహాదారుగాను, నేషనల్ ప్రొఫెసర్‌గాను ఢిల్లీలో వుంటున్నారు.



ప్రొ. వాడియా జననం 1883 లో. అప్పటిలో బొంబాయి యూనివర్శిటీకి చెందిన బరోడా కాలేజీలో చదువు ముగించుకుని వెంటనే జమ్మూలో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ కాలేజీలో జియాలజీ ప్రొఫెసర్‌గా చేరారు. క్రమేపీ ఆ కాలేజీ ప్రిన్సిపాల్ అయ్యారు. అక్కడ వుంటూనే జియాలజీలో పరిశోధనలు మొదలు పెట్టారు. 1921లో జియలాజికల్ సర్వేలో చేరారు. 1939 లో సూపరింటెండింగ్ జియాలజిస్ట్‌గా రిటైర్ అయిన వెంటనే సింహళ ప్రభుత్వ ఖనిజశాస్త్రవేత్తగా నియమితులయ్యారు. 1945లో భారత ప్రభుత్వ ఖనిజ సలహాదారుగా స్వదేశానికి తిరిగి వచ్చారు. 1948లో భారతగనుల విభాగం (యిండియన్ బ్యూరో ఆఫ్ మైన్స్) స్థాపించడంలో చాలా కృషి చేసి, దానిమొదటి డైరెక్టర్‌గా కూడా పనిచేశారు. 1949 అణుశక్తి కమిషన్‌కి సలహాదారుగాను, 1962 లో నేషనల్ ప్రొఫెసర్‌గాను నియమితులయ్యారు.

ప్రొ. వాడియా మన దేశంలోను, విదేశాల్లోను అనేక భూభాగాల్ని గురించి పరిశోధించారు. కాశ్మీర్, హిమాలయాలు, పంజాబ్, పశ్చిమ ఉత్తర పరగణాలు, సింహళ ప్రాంతాల భూగర్భ విశేషాల్ని వీరు క్షుణ్ణంగా పరిశీలించారు. 1927లో జినీవాలోని ఆల్పైన్ స్కూల్ ఆఫ్ జియాలజీలోను, 1926—27లో బ్రిటిష్ మ్యూజియంలోను పని చేసారు. 1935లో ప్రపంచం అంతా పర్యటించి అనేక భూగర్భ శాస్త్రపరిశీలనలు చేసారు.

ప్రొ. వాడియా రచించిన గ్రంథాలు చాలా వున్నాయి. వీటిలో "జియాలజీ ఆఫ్ యిండియా" (మాక్మిలన్ కంపెనీవారి ప్రచురణ) 1919లో ప్రచురితమయి, యిప్పటికి అనేకసార్లు పునర్ముద్రితం అయింది. హిమాలయాలు, నంగాపర్వత్, గిల్‌జిత్ జిల్లాల భూగర్భశాస్త్రానికి సంబంధించిన యితర గ్రంథాలున్నాయి వీరివి, వైజ్ఞానిక వ్యాసాలు 100 వుంటాయి.

ప్రొ. వాడియాకి మన దేశంలోను, విదేశాలలోను వైజ్ఞానిక సంస్థలు అనేక పతకాలు, బహుమానాలు యిచ్చాయి. లెక్కలేనన్ని సన్మానాలు, గౌరవాలు అందుకున్నారు. 1942 లో యిండియన్ సైన్స్ కాంగ్రెస్ ప్రెసిడెంట్. 1946—47లలో నేషనల్ యిన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్ ఆఫ్ యిండియా ప్రెసిడెంటు. ఇంకా అనేక ఇతరమైన వైజ్ఞానిక సంస్థలకి, సంఘాలకి అధ్యక్షత వహించారు. లండన్, అమెరికన్, బెల్జియమ్, జర్మన్ జియాలజికల్ సొసైటీలలో గౌరవ సభ్యులుగా ఎన్నికయారు. 1958 లో "పద్మభూషణ" బిరుదు వచ్చింది.

విదేశాలలో జరిగిన అంతర్జాతీయ సమావేశాలకి చాలాసార్లు హాజరయ్యారు. ఈజిప్టులో సలహాదారుగా పనిచేశారు. యిప్పుడు ప్రొ. వాడియా వయస్సు 85 సంవత్సరాలు. ఈయన అమూల్యమైన అనుభవం దేశానికి యింకా లభ్యమవడం మన అదృష్టమే.

— డా॥ ఆర్.ఎల్.ఎన్. శాస్త్రి




# చిన్నపిల్లల చదువులు-సమస్యలు

వారణాసి జానకీదేవి.........

ఉచిత విద్యాబోధన, స్కాలర్‌షిప్స్ వంటి సౌకర్యాలు పెరగడంవల్ల, ప్రతీ గ్రామంలో పాఠశాలలు లేవడంతోను ప్రతి వారూ చదువుకునే అవకాశం లభించింది. ప్రాథమికవిద్య (ఎలిమెంటరీ ఎడ్యుకేషన్) నిర్బంధం చేయబడింది. 5 సంవత్సరములు దాటిన ప్రతీబాలుడు, బాలిక జాతి, మత, వర్గ, కుల వివక్షత లేకుండా, గొప్ప, బీద తారతమ్యం లేకుండా ప్రాథమికవిద్య నేర్చుకోవాలి అనీ, ప్రతి వారూ అక్షరాస్యులుగా తయారవాలి అనే విశాల దృక్పథంతో ప్రభుత్వం 'నిర్బంధ ప్రాథమిక విద్యావిధానం' అమలు జరిపింది. తద్వారా కులవృత్తులు మాన్పించి ప్రతీ వారూ తమ పిల్లల్ని బడికి పంపవలసి వచ్చింది. యింతవరకూ బాగానే వుంది.

ఈ ప్రాథమిక విద్యాభ్యాసాన్కి ప్రతీ గ్రామంలో ఎలిమెంటరీ స్కూలు కాన్వెంటులు లేస్తున్నాయి. ముఖ్యంగా ముందు మనం కాన్వెంటు చదువు చూద్దాం. ఇదిఒక ఫాషన్. ఎలిమెంటరీస్కూలు చదువులంటే నామోషీ. పిల్లలకు మాతృభాష తెలీదు. ఎంతసేపు పాశ్చాత్య సభ్యత, సంస్కారం అలవర్చుకోవాలని విదేశీ పద్ధతులు, అనుకరణాల మోజులో పడి ఈ కాన్వెంటులు స్థాపించి మాతృభాష వదలి ఇంగ్లీషులో విద్యాబోధన గిరపుతున్నారు. తెలుగుమాట వినపడదు. అన్ని సబ్జక్కులు యింగ్లీషులోనే.

తల్లి తండ్రులు కూడా ఎలిమెంటరీ స్కూలు అంటే అదేదో భయంకర విషయంగా తలుస్తారు. మా పిల్లలు కాన్వెంటులో చదువుతున్నారంటే గొప్ప. యిదే భావన పిల్లలలోనూ స్థిరపడి పోతుంది. 5 ఏండ్ల మా బాబుకూడా 'బడికివెళ్లి చదువుకో' అంటే నేనుకూడా రిక్షాలో యూనిఫారం డ్రెస్ వేసుకుని చక్కగా కేరేజీ తీసికొని, (2 మైళ్లలో వున్న) కాన్వెంటుకు పోతానమ్మా అంటాడు కాని ప్రక్క సందులో వున్న ఎలిమెంటరీ స్కూలుకు పోవడాన్కి మొరాయిస్తాడు. ఈ విధంగా పిల్లలలో కూడా ఈ ఎలిమెంటరీ స్కూలు అంటే ఒకవిధమైన నీచభావం, నిరసన ఏర్పడుతోంది. ఈ భావం పిల్లల లేతమనసులలో నాటుకొని, వేళ్లు పాదుకొని పోవడాన్కి కారకులు ముఖ్యంగా తల్లి తండ్రులు.

చదువు విషయమా అంటే అంతా యింగ్లీషు సరే! పైడాబుతప్ప సరుకు వుండదు. అదీ క్రిస్టియన్స్ నడిపే కాన్వెంటు అయితే మరీ ఘోరం. పిల్లలకు మతబోధ తప్ప ఏమీ వుండదు పద్యాలు, పాటలు, కథలు అన్నీ ఏసుక్రీస్తు గూర్చే. పిల్లలకుకూడా ఆ వాతావరణమే పట్టుబడి, క్రిస్‌మస్ ప్రాముఖ్యత తప్ప మరే హిందూ పండగ గూర్చి తెలీదు. కేవలం వార్ని దూషించాలని నా ఉద్దేశ్యంకాదు. క్షమించాలి.

పిల్లలు ఎంతసేపూ వచ్చిరాని ఇంగ్లీషులో మాట్లాడుతూంటే తల్లితండ్రి మురిసిపోతారు తప్ప మాతృభాషకు వారిని దూరం చేస్తున్నామన్న వ్యథ, ఆలోచన వారిలో లేశమాత్రం కన్పించదు. సిటీలలో ఎలిమెంటరీ విద్యాసంస్థ కాన్వెంటు కావచ్చు కాని తల్లి అయినా తమ పిల్లలకు మాతృ భాష నెర్పకపోవడం కడు శోచనీయం.

5 వ ఏటనుండీ స్కూలులో చేరుతూనే ఇంగ్లీషు, పుస్తకాలుతో వాడికి అర్థం అవడం కష్టమే. వాడికి కాస్త జ్ఞానం వచ్చి, అవగాహన చేసుకోవడాన్కి ప్రయత్నించే సర్కి ప్రాథమికదశ దాటిపోయి, కిండర్‌గార్టన్ వచ్చేస్తుంది వీడికి మతికూడా పోతుంది.

ఈ చదువు వలన సుఖంలేదు బస్సుకి, రిక్షాలకు, స్కూలుఫీజులకు యివికాక యింకా చిల్లర ఖర్చులు, యూనిఫారం మొత్తం నెలతిరిగే సరికల్లా 30, 40 రూ దాటిపోతుంది చదువు ఖర్చు. ఏ కాన్వెంటయినా ఈఖర్చు యింతే! ఉన్నవారు పరవాలేదు. కాని మధ్యతరగతివార్కి యిబ్బందే! కాని విచిత్రమేమంటే కలెక్టరుగారమ్మాయి చదివే కాన్వెంటులోనే గుమాస్తా గారమ్మాయిని చదివించాలి అనీ ఆతల్లి తండ్రులు తమ స్టేటస్‌కు భంగం రాకుండా చూస్తారు. సిటీలలో కాన్వెంటు తప్ప మరొక విద్యాసంస్థ లేకపోవడంతో తల్లితండ్రులు శక్తికిమించిన ఖర్చయినా అక్కడికే పిల్లలను పంపవలసి వస్తోంది.

తల్లితండ్రులకు శక్తికిమించిన ఖర్చు. మాతృభాష శూన్యం. సైన్సు, సోషల్ వంటి సబ్జక్టులలో పిల్లలకు తెలివి తేటలా శూన్యం. లెక్కలు సరేసరి. ఈవిధంగా ఈకాన్వెంటు చదువులతో తల్లి తండ్రులు ఎన్నో సమస్యలకు గురవుతున్నారు. చిన్నపిల్లల చదువు ఈనాడు విషమ సమస్య అయింది.

చదువు అంటే ఊరికే చెప్తారుకాని

మరి పుస్తకాలో! పూర్వకాలం అంటే మా చిన్నతనంలో పుస్తకాలు ఎవరో రచయితలు రాయడం, కొనడం చదవడం జరిగేది. ఇగీదుకూడా సామాన్యులకు అందుబాటులో వుండేది. 1 రూపాయిమించి ఏ పుస్తకం ఖరీదు వుండేదికాదు (5 వరకు) 4 వ తరగతినుండి భూగోళం, చరిత్ర, సివిక్సు, తోటపని—యివి వుండేవి. తెలుగు వాచకం వుండేది, కాపీ బుక్ వుండేది. 5, 6నోట్సులు లెక్కలబుక్కులతో సంవత్సరం చదువు గడిచిపోయేది.

యిక ఈనాడు 1,2, 3 వ తరగతుల పిల్లలు బడికి మోసుకుపోయే పుస్తకాలు బండెడు. 6, 7 సం. కు ంఠె వుండవు. 2వ క్లాసునుండీ సైన్సు, సోషల్, తెలుగు, ఇంగ్లీషు, హిందీ—యిట్లా అన్నిసబ్జక్టులు చెపుతున్నారు. చిన్న తరగతులలోనే యిన్ని సబ్జక్టులు చదవడానికి పిల్లలకు శక్తి, ఓపిక తెలివితేటలు ఎక్కడినుండి వస్తాయి? ఒక పాతిక నోట్సులు, అరడజను లెక్కల పుస్తకాలు. చదువంటే ఊరికే చెబుతున్నారు కానీ ఈ పుస్తకాల ఖర్చు భరించేది తలితండ్రులే కదా! మధ్యతరగతివారికి ఫరవాలేదు. కూలీనాలీ, కులవృత్తులు చేసుకునే వారి పిల్లల గతేమిటి? మా చాకలయితే 'మావాడు శుభ్రంగా నాతో నాలుగ్గురేవులుతికి నాలుగ్గుడబ్బులు సంపాదించయినా యిచ్చేవాడు. ఈపాడు సదువులొచ్చాక నా రెక్కలకష్టం అంతా ఈడి సదువుకే సాలటంలేదు' అంటూ 3 వ క్లాసు చదివే 8 ఏళ్ల కొడుకు చదువుగూర్చి చెప్పి బాధపడుతుంది.

సబ్జక్టుకి 5, 6 నోట్సులు కొనవలసిందే. మాస్టరుచెప్పినట్లు నోట్సు పెట్టకపోతే చివాట్లు. ఇక పాఠ్య పుస్తకాల ధరలు మరీ విపరీతమయి పోయాయి. పూర్వంలా కాక యిపుడు పుస్తకముద్రణ ప్రభుత్వం వారి హస్తగతం కావడంతో విద్యార్థుల తలితండ్రుల బాధ మరీ ఎక్కువైంది అన్నిపుస్తకాల వెల రూపాయి దాటాకనే! ప్రభుత్వంవారు ప్రచురించిన పాఠ్యగ్రంథాలే కొనాలి. ఈ గవర్నమెంటు పబ్లికేషన్సు ధర్మమా అని పుస్తకాలధరలు దారుణంగా పెంగాయి. దానికి తగ్గట్లుగా 2వ క్లాసునుండే అన్నిసబ్జక్టులు పెట్టడంతో తలితండ్రులు ఈ పుస్తకాల ఖర్చు భరించలేకపోతున్నారు. కొత్తలో గవర్నమెంటువారు పాఠ్యపుస్తకాలు ప్రచురిస్తారంటే చవగ్గా లభిస్తాయని ఆశించినవారికి ఈధరలు చూస్తూంటే మతి పోతోంది.

దీనికిసాయం గైడ్సు. 3 వ క్లాసు నుండే Guides. ఉపాధ్యాయుడు చెప్పేది తక్కువ. మరొకవిషయం. కొందరు ఉపాధ్యాయులు పిల్లలను తమవద్ద ప్రైవేటు చెప్పించుకోమని పిల్లలను నిర్బంధించడం. పిల్లల ప్రాథమిక దశనుండే తలితండ్రులు ఈవిధంగా యిన్ని సమస్యలను ఎదుర్కోనవలసి వస్తోంది. దానితో పిల్లలు ముఖ్యంగా 'చిన్నపిల్లల చదువులు' అనగానే తల్లిదండ్రులకు సింహస్వప్నంలా వుంటుంది. ఈనాడు చదువు కారణంగా ఉత్పన్నమయే సమస్యలన్నీ పరిష్కరించుకోవడం కూడా చదువులో ఒక భాగంగా తయారయింది. విద్యవలన పిల్లలలో గాంభీర్యం ఏర్పడాలి. ఆత్మగౌరవం మేల్కోనాలి.

నవనాగరికత, విద్యా సంస్కారాలున్న తల్లులు చాలమందిలో బిడ్డలను సాకే సహజగుణం సక్రమ పరిణతి పొందడంలేదు. భారమైన చదువులతో, తలితండ్రులప్రేమ రాహిత్యంతో పిల్లలు అసహజ వాతావరణంలోకి నెట్టబడుతున్నారు. సక్రమమైన అభివృద్ధికాక, కృత్రిమమైన నాగరికత పిల్లలను ఆవరించుతోంది. హృదయాన్ని హత్తుకునేవి కావాలి. 9—12 మధ్య పిల్లలకు తమాషాలు; జానపద కథలు, యుక్తి కథలు, స్కూలు, స్నేహితులకు సంబంధించినవి యిష్టం. రేడియో, కరెంటు, గాలి, నక్షత్రాలగూర్చి విజ్ఞానదాయక విషయాలు కథలు, కబుర్ల రూపంలోనే వారిని ఆకర్షిస్తాయి చిక్కుప్రశ్నలు, పజిల్సు కూడా మెదడుకుమేత. వీలయినంతవరకూ ప్రతిరచనకు బొమ్మలు తగినట్లు వేస్తే ఆ రచన పిల్లల మనస్సులో హత్తుకొనిపోయి, సులభంగా వారిని ఆకర్షిస్తుంది.

విదేశాలతో పోల్చిచూస్తే మనం ఎంత వెనుకబడివున్నామో తెలుస్తుంది. క్లాసులో మాస్టారు చేరిన మొదట్లోనే బెత్తం చూపించి 'బడి' అంటే పిల్లలకు సింహస్వప్నంలా చూపిస్తారు. హైస్కూళ్లలో తప్ప పేరెంట్స్‌డే, ప్రోగ్రెస్ రిపోర్టులు వుండవు.

పిల్లలకు క్రమశిక్షణ యివ్వడంలోనే తల్లి ఓర్పు, నేర్పు మిళితమై వున్నాయి. పిల్లలను క్రమశిక్షణలో పెంచితే వారి కీర్తిని, భారతదేశ కీర్తిని నిలబెట్టే ఉత్తమ పౌరులుగా రాణిస్తారు. 'నేటి బాలలే రేపటి పౌరులు.' అటు. తల్లిదండ్రుల, ఇటు ఉపాధ్యాయుల బాధ్యతారహితానికి లోనైన ఈ పిల్లలు భావిభారత పౌరులుగా ఏమి రాణిస్తారు? ●






### జ రి గి న క థ

సావిత్రమ్మ ఒక మధ్యతరగతి ఇల్లాలు. ఆమె భర్త రామనరసయ్య. పెద్దకొడుకు గోపీ వారాలు చేసుకుని పై క్లాసుల్లో చదువుకుంటూ వుంటాడు. విధిలేక చిన్నవాడు మురళిని నరసింహానికి పెంపకం ఇస్తుంది. గోపీ తెలివి తేటల్ని గ్రహించి అతనికి తన ఇంటిలోనే వసతి ఏర్పాటు చేస్తాడు ప్రొఫెసరు. అతని కుమార్తె అనిత. అనిత ప్రవర్తన గోపీకి నచ్చదు. గోపీ ఆచోటు విడిచి పెట్టేస్తాడు విదేశాలకి వెళ్తాడు. విమల కాన్వెంటులో చేరి మార్గరెట్‌గా మారుతుంది. విమల తృణీకరించిన సంబంధాన్ని చేసుకని కమల రాధిక అవుతుంది ఫారిన్‌లో గోపీకి పద్మినితో పరిచయమవుతుంది. హనుమాయమ్మగారి సానుభూతి వచనాలతో యామినికి భవిష్యత్తుమీద నమ్మకం తోచింది.

## 13

గోపీ రాధికకు ఒకదీర్ఘమైనం జాబు వ్రాశాడు.

కమలా,

మీ యిద్దరి ఫోటోతో కూడా నీవు వ్రాసినజాబు చేరింది. ఇంతదూరాన ఉన్న నన్నుకూడా మాబావగారు ఆకర్షించారు. ఆయనకళ్ళు సామాన్యమయిన కళ్ళుకావు. వాటిలో ఆకర్షణశక్తి అధికంగా ఉంది. మగవాడిని నన్నే ఆ కళ్ళు చిత్తుచిత్తు చేస్తున్నాయి. ఇక ఆడపిల్లవు నీసంగతి వేరే చెప్పాలా ?

నీవు వ్రాసినట్టుగా ఆయన నిజంగా అదృష్టవంతుడే. లేకపోతే కూర్చున్న చోటనే సమస్త విద్యలూ ఆర్జించలేడు. ఆయన కోరుకున్నవన్నీ ఆయనదగ్గరకే నడిచి వస్తున్నాయంటే ఎంత అదృష్టం. ఆ లోపం ఉన్నవాళ్ళకందరికీ ఇట్లా జరుగుతున్నదా ? ఇంతకూ నీవు పెట్టి పుట్టావు. అందుకు నా అభినందనలు.

నేను మొన్న సాయంత్రం పెళ్ళి చేసుకున్నాను. పేరు పద్మిని. ఇక్కడ రీసర్చి చేయటానికి వచ్చింది. పద్మిని ఫోటో పంపుతున్నాను. ఎలా ఉందో వ్రాయి. మేమిద్దరం విలాసయాత్రకు వెళ్ళుతున్నాము. వచ్చిన తరువాత అందరికీ మళ్ళీ ఉత్తరాలు వ్రాస్తాను. అప్పటికి అందేటట్టుగా నాకు ఒకజాబు వ్రాయి.

నీ అన్న
గోపీ.

కమల పద్మినిఫోటో తిప్పితిప్పి చూసింది. పద్మిని కనుముక్కుతీరు ఆకర్షణీయంగా ఉంది. పొగసులు తీర్చినట్లుంది. అలలు అలలుగా ముఖంమీద పడుతున్న ముంగురులు—విచ్చుకుంటున్న గులాబిలాంటినోరు—సొట్టపడిన గడ్డము—పెద్దకళ్ళు—చూడగానే ఆకర్షించే ముఖం. కమల ఆఫోటోను చూసి ఎంతో సంబరపడ్డది. తీసుకువెళ్ళి చక్రపాణికి చూపించింది.

బావమరిది వ్రాసిన ఉత్తరం చూసి నవ్వుకున్నాడు చక్రపాణి.

నిండునెలలతో నడవలేక నడవలేక నడుస్తున్న రాధికను చూసి 'మీ అన్నయ్యకు ఈ వార్త చేరిందా లేదా ?' అన్నాడు చక్రపాణి.

'ఎవరు వ్రాస్తారు ?'

'నీవే వ్రాయాలి'

తలవంచుకుని వారకంటితో చక్రపాణిని చూసింది. అతడు ఆమె గర్భంవైపే చూస్తున్నాడు.

తలవంచుకుంది రాధిక. క్రిందికి నడిచింది.

'మాల కట్టావా.? పైకి వెళ్ళలేదేం!' హనుమాయమ్మగారు లోపలినుంచివచ్చింది. కళ్ళు మూసుకుని గోడకానుకుని కూర్చున్న రాధికను చూడగానే ఆమెకు ఏదో సందేహం కలిగింది.

'ఏమిటి రాధికా ? అలా కూర్చున్నావు?'

రాధిక మాట్లాడలేక పోయింది.

'చెప్పమ్మా, ఏమిటి! లేవలేవా? నడుము నొప్పా ? ఏమిటి చెప్పు?'

రాధికకు కళ్ళనీళ్ళు వచ్చాయి. 'మా అమ్మ రాలేదు.' అంది తలవంచుకుని.

'పిచ్చిదానా. అమ్మ రాకపోతే నేను లేనూ ! నేనూ అమ్మవంటిదాననే.'

పైనుంచి గంట వినబడ్డది. హనుమాయమ్మగారు పైకివెళ్ళింది. 'రాధికను హాస్పిటల్‌కు తీసుకువెళ్ళాలి. నేనుకూడా వెళ్తాను.' ఆమె కిందికివచ్చి రాధికకు వేడివేడి పాలు ఇచ్చి బయలుదేర తీసింది.

రాధికను హాస్పిటల్లో చేర్చుకుని 'ఇది మొదటి కాన్పుకదూ. కాస్త ఆలస్యమవుతుంది.' అన్నారు డాక్టర్లు.

హనుమాయమ్మగారు వయసులో పెద్దదేగాని పురుళ్ళ అనుభవము తక్కువ. బాధ పడుతున్న రాధికను చూసి ఆమె కళ్ళనీళ్ళు కార్చటం మొదలుపెట్టింది.

రాధిక రెండుసార్లుఅడిగింది. 'అత్తయ్యగారూ, అమ్మ వచ్చిందా?' అంటూ.

'లేదమ్మా. దిగులుపడకు రాధికా. అన్నిటికీ నేను ఉన్నాను.'

రాధిక నడుము సవరించుకుంటూ 'అమ్మ ఇప్పుడయినా రాలేదు. నేను రమ్మని వ్రాసిన ఉత్తరాలు—స్టేషనులో కలిసినప్పుడు చెప్పిన చెప్పటాలూ ఏమయి

పోయాయి ? అమ్మకు నామీద కోపమా ? నిర్లక్ష్యమా ? లేక నిర్దయురాలా ?' కళ్ళు ఒత్తుకున్నది.

మరునాడు మధ్యాహ్నం సూర్యుడు నడి నెత్తిన ఉండగా రాధిక మగపిల్లవాడిని డాక్టర్ల సహాయంతో కన్నది. హనుమాయమ్మగారు బిడ్డను చూసి పట్టలేని ఆనందంతో చక్రపాణికి కబురు చేసింది.

పిల్లవాడు పుట్టగానే వచ్చి చూడలేని చక్రపాణి అశక్తతను తలచుకుని రాధిక కళ్ళు చెమ్మగిల్లాయి.

తండ్రి అయ్యాడన్న కబురు వినగానే వెళ్ళి చూడలేక పోయినందుకు చక్రపాణి గుండె గిజగిజ లాడిపోయింది.

అతడి మనసులో ఎంత బాధ ఉంటుందో తెలిసిన రాధిక 'అత్తయ్యగారూ. మనం ఇక్కడినుంచి ఎప్పుడు వెళ్తాం' అన్నది.

'అప్పుడేనా? పుట్టి ఇరవైనాలుగు గంటలు కాలేదు. అప్పుడే కదల్చటమా? మూడోరోజు నీకు పథ్యం పెట్టాలి అంతా క్షేమంగా గడిస్తే పదవనాటికి వెళ్దాము' మనమడి తొట్టిదగ్గర నిలబడ్డది హనుమాయమ్మగారు చూస్తూ.

'అయితే పదిరోజుల వరకూ ఆయన ఈ పాపను చూడటానికి వీలులేదు కదూ?'

'వీలుంది కాని పాణి నలుగురి కళ్ళల్లో పడటం నాకిష్టం లేదు. నేను ఎంతో బాధతో చెప్తున్నమాటలనుకో ఇవి' ఆమె ముఖం పక్కకు తిప్పుకున్నది.

రాధిక ఆలోచనలను చెదరగొడుతూ జూనియరు చక్రపాణి కేర్ కేర్ మంటూ ఏడవటం మొదలు పెట్టాడు ఆమెకు కర్తవ్య జ్ఞానం కలిగిస్తూ.

తల్లి అయిన రాధిక తన తల్లినిగురించి ఆలోచించటం మానివేసింది. అబ్బాయి తండ్రిని గురించి ఆలోచించటం అంతకంటె మానేసింది. పొత్తిళ్ళలో వెలుగుతున్న పాపాయిని గురించి ఆలోచించటం మొదలు పెట్టింది. ఉప్పొంగిన- ఆమె హృదయాన్ని కళ్ళుతెరువని ఆపసి గుడ్డును గురించిన ఆలోచనలు చుట్టుముట్టాయి. ఆమె హృదయంలో మాతృప్రేమ పొంగటం మొదలు పెట్టింది.

* * *

రాధికకు పథ్యం పెట్టి ఆమె దగ్గర మనిషిని ఏర్పాటుచేసి హనుమాయమ్మగారు ఇంటికి వెళ్ళింది. తల్లిరాగానే పైకివచ్చి హాస్పిటల్ సంగతులు వివరంగా చెప్పమని చక్రపాణి గంటకొట్టి ఆమెను పిలిచాడు.

'నాయనా, నీ కొడుకు పగలంతా నిద్రపోతాడు. రాత్రిళ్ళు ఏడిపిస్తున్నాడు. అది బాలెంత, మేలుకుని ఉండటానికి వీలులేదు.



పోయి మెచ్చి వంతులు వేసుకుని ఏత్తుకుంటున్నాము. తల్లిదగ్గర ఇంకా పాలు పడలేదు. నర్సులు గ్లూకోస్ నీళ్లు పోస్తున్నారు. చిక్కుడుగింజలల్లే కళ్లు పెట్టుకుని చూస్తున్నాడు. అక్కడి సంగతులు ఇంకా ఏం చెప్పమన్నావు?' అన్నది హనుమాయమ్మగారు పైకివెళ్లి.

'అయితే ఎల్లుండి తీసుకురావటం ఖాయమేనా?'

'ఖాయమే; శాస్త్రిగారిని వర్జము చూడమని చెప్పాను. ఉదయం ఎనిమిది గంటలకు బాగున్నదన్నారు.'

'అయితే అమ్మా, వాళ్లను మేడమీదికే తీసుకువస్తావు కదూ?'

హనుమాయమ్మగారికి అతడి మనసులో ఉన్న ఆరాటము అర్థమయింది. 'అబ్బాయినా పైకి తీసుకువచ్చి ఉంచితే పిల్లవాడిని చూసుకోవటం రాధిక ఒక్కదాన్నుంచి అవుతుందా? వేనుకూడా చూస్తూ ఉండాలి. అందుకని క్రింద గది ఒకటి శుభ్రం చేయిస్తున్నాను. నెలరోజులయిన తరువాత రాధిక ఎప్పుడయినా వచ్చిపోతూ ఉంటుంది మేడమీదికి. ఈ ఏర్పాట్లన్నీ రాధికకు కూడా చెప్పాను.'

మాట్లాడకుండా తల్లి ముఖంలోని చూశాడు.

హనుమాయమ్మగారు ముసిముసి నవ్వులు నవ్వింది కొడుకును చూసి.

చక్రపాణి తెల్లబోతూ 'అమ్మా నాతో హాస్యమాడుతున్నావా?' అన్నాడు.

'నీవే మంటావోనని అంటున్నాను. కాని అసలు సంగతి అబ్బాయికి శాంతి ఉన్నది. జపతపాలు చేయించాలి. ఖరీదానాలు ఇవ్వాలి; అంతవరకూ నీవు వాడిని చూడ కూడదు. పదిహేనవరోజు శాంతి చేయించ టానికి నిశ్చయమైంది. ఆరోజు కాని నీవు అబ్బాయిని చూడటానికి వీలులేదు.'

'అయితే ఇంకా వారంరోజులు ఆగాలన్న మాట చూడటానికి?'

'అవును'

తల్లి పిల్లవాడిని ఇంటికి తీసుకు వచ్చిననాడు ఇంట్లో ఎంతో హడావడి. సందడి చూడ టానికయినా చక్రపాణి క్రిందికి రాలేదు. ఇది అందరి మనసులలో మెదిలి బాధించింది.

పురిటిస్నానము భోజనాలు అయిన తరువాత పగలు పడుకోకుండా పుస్తకం చదువుకుంటూ పడుకున్నాడు చక్రపాణి. క్రింద పసిపిల్లవాడి ఏడుపు వినబడ్డది.

చదువుతున్న పుస్తక మక్కడ పడేసి వింటున్నాడు చక్రపాణి. తను పసిపిల్లలను చూడలేదు. వాళ్ల ఏడుపు వినలేదు. ఆ ఏడుపుకు అతడి దేహము గగుర్పాటు చెందింది. ఆ ఏడుస్తున్న పిల్లవాడిని చూడాలని మనసు తహ తహ లాడింది.

ఆ చిన్న మనిషిని చూసి ఒక్కసారి చేతో్త తాకాలని మనసు ఆరాట పడ్డది. పిల్లవాడి ఆలోచన వచ్చినప్పుడల్లా మరో పనిలో మనసు లగ్నము కావటంలేదు. ఎన్నడూ లేనిది మాటి మాటికి గంట వాక్కటం మొదలుపెట్టాడు.

'ఏం కావాలి అయ్యగారూ?' నౌకరు వచ్చి అడిగేవాడు.

'నా కేం వద్దు. అందరూ ఏం చేస్తున్నారు?'

చిన్న బాబుగారు పడుకున్నారు. అమ్మాయి గారు మేలుకునే పడుకున్నారు. పెద్దమ్మ గారు ఆ గదిముందర కుర్చీ వేసుకుని కూర్చున్నారు.'

'అయితే సరే. క్రిందికి వెళ్లు. నా కేం పనిలేదు.'

ఈ విధంగా రోజుకు అయిదారు పర్యా యాలు జరిగింది.

హనుమాయమ్మగారు నవ్వుకున్నారు.

పదిహేనవరోజు శాంతి నామకరణం జరిగింది. హనుమాయమ్మ మనమడు పుట్టిన సంతోషంతో బ్రాహ్మలకు విరివిగా దానాలు చేసింది.

శాంతి అయిన తరువాత పిల్లవాడిని క్రీగంట చూశాడు చక్రపాణి. పురోహితుడూ తల్లి తనవైపు చూస్తున్నారేమోనని భయము, ఇంత ఆత్రమా అంటారని జంకు.

శాంతి అయిన తరువాత ఏం పేరు పెట్టాలని తల్లీ కొడుకూ తర్జన భర్జన అయినారు. 'ఈ యింట పుట్టటమే పేరుతో పుట్టాడు?' ఈమాట అనటమే కాని హనుమాయమ్మగారు పేరు ఫలానా అని చెప్పదు. అది ఎటువంటి పేరో? నాజూకుగా ఇప్పటి పేరు పెట్టాలని చక్రపాణి పట్టుదల. తల్లి పెట్టేది మోటుగా ఉంటె తను పిలవలేదు.

చివరకు హనుమాయమ్మగారు 'మా మామగారిపేరు కేశవరావుగారు. ఈ ఐశ్వర్య మంతా ఆయన స్వయంగా కష్టపడి సంపాదించారు. చంద్రమ్మగారు మా అత్తగారు. అన్నిటిలో ఆయనకు తోడునీడై నిలిచారు. ఇద్దరూ సామరస్యంతో అనుకూలంతో— అనురాగంతో జీవించారు. వాళ్లిద్దరిపేర్లు కలిపి పెట్టుకుని వాళ్లను మనము స్మరించుకోవటం మన ధర్మం. కేశవ



చంద్ర అన్నపేరు నా మనసులో విశ్వయమ్మైపోయింది' అను మాయమ్మగారు కొంగుతో ముఖం తుడుచుకున్నది.

చక్రపాణి తలవంచుకుని తల్లి చెప్పేదంతా విన్నాడు. ముడుచుకున్న కనుబొమల విప్పారినాయి. వంచిన తల ఎత్తాడు. అతడి పెదవులమీద చిరునవ్వు మొలకలెత్తింది.

పసిబిడ్డ కేశవచంద్ర అయ్యాడు.

ఘర్షణ ఎరుగని ఆ యింట్లో చిటికిమాటికి తల్లీ కొడుకులమధ్య అత్తాకోడళ్ల మధ్య, భార్యాభర్తల మధ్య ఘర్షణ జరుగుతోంది. అంతా కేశవచంద్రను గురించే. అంతా అతడి సుఖాన్ని గురించే. అంతా అతడి క్షేమంకోసమే. కాని అది ఘర్షణ కాదు. మధురానుభూతిని కలిగించే ఉద్రేకపూరిత మయిన సంభాషణ.

మధ్యాహ్నం అందరూ క్రిందికి వెళ్లిపోయిన తరువాత—పసిబిడ్డను చూడటానికి కుర్చీలో బయలుదేరాడు చక్రపాణి. వరెండాకు అటు చివర చక్రపాణి గది. ఇటు చివర కేశవచంద్రది.

చక్రపాణి వచ్చేసరికి ఒడిలో పసిబిడ్డను పెట్టుకుని మంచంమీద కూర్చుని ఉన్నది రాధిక. చక్రపాణి దగ్గరగావచ్చి పిల్లవాడి చేతులూ కాళ్లూ ముట్టుకుని చూశాడు.

'ఎత్తుకుంటారా ?'

తల ఊపాడు చక్రపాణి.

రాధిక పిండా బట్టకప్పి పసిబిడ్డను చక్రపాణి రెండు చేతులలో పెట్టింది.

'అంతదూరంగానా పట్టుకోవటం? అలా పట్టుకుంటే ఏడుస్తాడు.'

నవ్వుతూ ఆమెచేతికి తిరిగి యిచ్చేశాడు.

ఆనాడు తండ్రినయ్యా నన్నగర్వము అతడి మనసులో సంచారం చేసింది.

* * *

నాలుగురోజుల । వ్యవధిలో వంటకు మనిషిని చూస్తానని చెప్పిన వకీలు సాంబయ్యగారు ఇంకా చూస్తునే ఉన్నారు. ప్రతిరోజూ సాయంత్రము శాంతమ్మ మంచం దగ్గర కూర్చుని 'ఎక్కడా మనకు తగిన మనిషి దొరకలేదే' అంటాడు.

'ఎవరినో ఒకరిని చూడండి, పాపము ఆవిడ ప్రయాణం పెట్టుకుంది.'

'ఎవరో ఒకరు అంటే ఎట్లా చెప్పు? ఇవాళ ఉదయం కనబడిన మనిషి ఎట్లా ఉందనుకున్నావు? చక్కగా అలంకారం చేసుకుని ఇస్త్రీ చీర కట్టుకుని ఉంది. ఒక మొగవాడు కనబడ్డాడు. నాముందర నిలబిడ్డ అయిదునిమిషాలలో రెండుసిగరెట్లు తాగి పారేశాడు. అటువంటి వాడిని ఎట్లా పెట్టుకుంటాము చెప్పు? వంట చేస్తూ కూడా అవాటు చొప్పున సిగరెట్లు తాగుతూ కూర్చుంటే ఎట్లా పనికి వస్తుంది? మా అమ్మ పెద్దది. మడి వంట కావాలంటుంది. సిగరెట్లు తాగుతూ

వచ్చి వడ్డిస్తాడు. ఆమె ఒప్పుకుంటుందా?' శాంతమ్మ అడిగిన దానికి సమాధానంగా అన్నాడు.

'అయితే ఎట్లా? ఆమె మన ఇబ్బందులు గడిపినందుకు మనం కూడా ఆమె పరిస్థితులను గమనించాలి. ఎవరినో ఒకరిని పెట్టండి. ఆ ఇస్త్రీ చీరెకట్టుకున్న ఆవిడ అయినా సరే' శాంతమ్మ తొందర పెట్టింది.

'చెప్పటం సులభమే. సావిత్రమ్మ మా అమ్మకంటె నీకంటె పొదుపుగా చేస్తున్నది. ఒకసారి సామాను చెప్పి పడేస్తే నెలవరకూ వాటినే వాడుతుంది. మీరు ఎవరయినా వంటచేస్తే ప్రతిరోజూ ఏదో ఒక సామాను లేదన్న గొడవే, ఆ సామాను లేకపోతే వంట కాదని గొణగటమే. ఆమె చూడు, రుచికి రుచీ పొదుపుకు పొదుపూ ఉంది. వంట మనిషిని పెట్టాలంటే ఇన్ని విషయాలు ఆలోచించాలి మరి.'

'ఇది మరీ బాగుంది. అయితే మనకు ఇప్పట్లో దొరకదు వంట మనిషి.' శాంతమ్మ విసుక్కున్నది.

ఇటువంటి చర్చలు ప్రతిరోజూ సాగుతున్నాయి. సావిత్రమ్మ తన ప్రయాణం రేపో మాపో సాగుతుందని అనుకుంటున్నది.

హనుమాయమ్మగారు రాధికకు పురిటి నీళ్లు పోసిన తరువాత శాంతి నామకరణ మహోత్సవాలకు రావలసినదని సావిత్రమ్మకు ఒక ఉత్తరం వ్రాసింది.

క్షేమంగా పురుడు వచ్చి తల్లీ పిల్లవాడు కులాసాగా ఉన్నందుకు సావిత్రమ్మ చాలా సంతోషించింది. పురుడు వచ్చిన తరువాత వయినా వెళ్లి ఒక్కసారి రాధికను పిల్లవాడిని చూసిరావాలి. విజయవాడస్టేషనులో కలిసినప్పుడు తను తప్పకుండా పురిటికి వస్తానని అంటే రాధిక ముఖం ప్రఫుల్లమయింది. తను వెళ్లలేనందుకు రాధిక చిన్నబోయి ఉంటుంది.

ఆ పూట వెళ్లినప్పుడు శాంతమ్మతో తన ప్రయాణం సంగతి గట్టిగా చెప్పాలను కున్నది సావిత్రమ్మ. దృఢంగా నిశ్చయించుకుని సంచిలో బట్టలుతీసి మళ్లా సర్దుకున్నది. నాలుగురోజుల క్రిందట గోపీ వ్రాసిన ఉత్తరం మళ్లీ ఒక్కసారి సూట్కేసులోనుంచి తీసి చదువుకున్నది.

'అమ్మా!

# జీవితవలయాలు

నన్ను నీవు మనసారా క్షమించాలమ్మా. నీకు చెప్పకుండా ఇక్కడికి వచ్చినందుకూ, నీ అనుమతిలేకుండా పెళ్లిచేసుకున్నందుకు నన్ను క్షమించాలి.

మన దేశంనుంచి వచ్చిన అమ్మాయి ఇక్కడి కివచ్చి రీసర్చి చేస్తున్నది. నా కంటికి నచ్చింది. నీవు కోరే మంచిగుణాలన్నీ ఆ అమ్మాయిలో ఉన్నాయి. ముఖ్యంగా అందుకే నాకు నచ్చింది.

నా మీద నీవు ఎన్నో ఆశలు పెట్టుకున్నావు. నా నుంచి ఎంతెంతో ఆశించావు. కాని నేను ఒక్కటీ నెరవేర్చలేదు. అనేక విషయాలలో నిన్ను చిన్నబుచ్చాను. నా తోడబుట్టిన వాళ్లకు కించిత్తయినా సహాయము చేయలేని వ్యర్థుడను.

నా చదువు పూర్తయిన తరువాత ఇంకా కొంతకాలము ఇక్కడే ఉండి పని నేర్చుకోవాలనుకుంటున్నానమ్మా. ఇందుకు నీవు అనుమతించాలి.

నా భవిష్యత్తుకు నీ ఆశీర్వచనం కావాలమ్మా. ఈ ఉత్తరంలో నీ కోడలి ఫోటో పంపుతున్నాను.

వెంటనే ఉత్తరం వ్రాస్తావు కదూ.

నీ కుమారుడు
గోపీ.

రోజుకు పదిసార్లయినా ఈ ఉత్తరం చదువుకుని దీర్ఘ నిశ్వాసాలు విడుస్తూ సావిత్రమ్మ వకీలు సాంబయ్యగారింటికి వెళ్లి వస్తున్నది. మరునాడు ప్రయాణం కనుక చెప్పివెళ్లటం మర్యాద అనుకుని సావిత్రమ్మ శాంతమ్మ యింటికి వెళ్లింది.

'సావిత్రమ్మా ఒక్కదానవు కదా. ఇక్కడ ఉండరాదూ! చీకట్లో ఇంటికి వెళ్లకపోతే ఏం?' అంటుంది ముసలమ్మ ఆ రాత్రి భోజనాలయిన తరువాత బయలుదేరిన సావిత్రమ్మతో.

'వెళ్లాలి. ఎంత రాత్రయినా వెళ్లాలి. వెళ్లి ఆ యింట్లో మంచంమీద పడుకుని రామనరసయ్య ఫొటోవంక చూస్తూ ఉండగా రెప్పలు వాటంతట అవే మూతలు పడాలి.' అనుకుంటుంది సావిత్రమ్మ.

రాత్రిళ్లు మంచంమీద పడుకుని 'చూశారా గోపీ ఏం చేశాడో?' అని చెప్పబోతుంది. కాని అంతలోనే—'వాడు అభివృద్ధిలోకి వచ్చాడు. నా కదే పదివేలు' అనుకుంటూ ఉండగా కన్ను మూతపడుతుంది.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు శంకరం వచ్చాడు. ఇన్ని రోజుల కబుర్లు చెప్పుకున్నారు తల్లీ కొడుకులు. సావిత్రమ్మ రాధిక పురిటికి వెళ్లలేక పోయినందుకు శంకరం ఎంతో నొచ్చుకున్నాడు.

'ఒక్కసారి విమలను చూడాలని ఉన్నదమ్మా'.—

'విమలను మనం చూడలేము.' ఎప్పుడయినా అది వచ్చి చూడవలసిందే'

'అమ్మా. మురళిని పిలిపించవూ! క్రిందటిసారి కూడా చూడలేకపోయాము. ఆ ఈడు పిల్లలను ఎవరిని చూసినా వారివి చూసినట్లే ప్రాణము కొట్టుకుంటుంది.' అన్నాడు జాలిగా.

'నరసింహంగారు ఊళ్లోలేరు. సెలవులకు బెంగుళూరు వెళ్లారని తెలిసింది. మనం రాధికను, విమలను, మురళిని, గోపీని చూడాలన్న కాంక్షను చంపుకోవాలి బాబూ. వాళ్లు ఎక్కడ ఉన్నా క్షేమంగా ఉన్నారని తెలిస్తే చాలు. నాకదే తృప్తి.' కళ్లు ఒత్తుకున్నది సావిత్రమ్మ.

శంకరాన్ని రైలుకు పంపి మసక చీకట్లలో వకీలుగారింటితోవ పట్టింది సావిత్రమ్మ. ఆమెకు ఒక క్షణం తీరిక దొరికినా మొదట గోపీని గురించి తరువాత శేషగిరిని గురించి తరువాత శంకరం... అట్లా కమల విమల మురళిలను గురించి ఆలోచిస్తూ ఉంటుంది. అందరూ క్షేమంగా ఉన్నారని తృప్తి పడుతూ ముందడుగు వేస్తున్నది.

తను కన్నబిడ్డలందరికీ రెక్కలు



వచ్చాయి. వచ్చి...వచ్చి...తమదారి తాము చూసుకున్నాయి. తానిప్పుడు ఒంటరి పక్షి...జతలేని...ఒంటిపక్షి.

తనకు ఉన్నంతలో బిడ్డలకు పెట్టి పెంచింది. మాతృప్రేమను సమానంగా పంచి యిచ్చింది. ఇప్పుడు తనదగ్గర ఏమున్నది? ఏం మిగిలింది? డబ్బులేదు—రెక్కలలో శక్తి ఉడిగింది. కాని...కాని... హృదయంనిండా మాతృప్రేమ—బిడ్డలపట్ల వాత్సల్యము మిగిలింది.

పవిత్రమ్మ నడుస్తున్నది. అది నాలుగు వీధులు కలిసిన కూడలి. జనసందడి ప్రారంభమయింది. పవిత్రమ్మ నిరాటంకంగా దాటుకుని వెళ్ళిపోతున్నది.

చౌరస్తాదాటి ఆమె పది అడుగులు వేసిందో లేదో—ఎక్కడినుంచో ఏడుపు... పసిగుడ్డు ... అప్పుడు పుట్టినబిడ్డ ఏడుపు. ఉండి ఉండి కీచుకీచుమని వినబడుతున్నది.

పవిత్రమ్మ ముందడుగు వేస్తూనే ఆలకిస్తున్నది.

మళ్ళీ అదే ఏడుపు.

ఆమె వెనక్కు తిరిగి చూసింది. ఎవరూ కనబడలేదు.

ఆమెకు ముందడుగు పడలేదు. వెనక్కు తిరిగి నాలుగు అడుగులు వేసింది. చెత్తకుండీ దగ్గరనుండి వినవచ్చిందా స్వరం.

పవిత్రమ్మ చెత్తకుండీ చుట్టూ చూసింది. బట్టల మూటలోనుంచి ధ్వని వస్తున్నట్లు గ్రహించింది. ఆమె ఆశ్చర్యంతో వొంగి చూసింది. ఆ మూట కొద్దిగా కదులు తున్నట్లు కనబడ్డది.

'నిస్సందేహంగా ఇది పసిబిడ్డ. ఎవరికో ఈ పసిపాప బరువయి పోయింది కాని, ఈబిడ్డ ఏం తప్పు చేసిందని చెత్తకుండీ దగ్గర విడువబడ్డది? ఈబిడ్డ పెరగటానికి కన్నతల్లి కాకపోయినా ఏ తల్లయినా ముందుకురావాలి.'

బిడ్డలను కనిపెంచిన ఆమె హృదయం పొంగింది.

'నాయనా రా!' అంటూ ఆ దుప్పటి మూటను గుండెకు హత్తుకుని ఇంటిదారి పట్టింది పవిత్రమ్మ.

ఇంటితలుపు తాళము తీసింది. చాకు శుభ్రంగా కడిగి పిల్లవాడికి బొడ్డు కోసింది. నీళ్ళు కాగపెట్టి వేడి వేడి నీళ్ళుపోసి నులకమంచం మీద పక్కవేసింది. గూళ్ళన్నీ వెదకి తేనెసీసా తీసుకు వచ్చి నాలుగు చుక్కల తేనె నాలుకకు రాచింది.

'ఓ పరమేశ్వరా, నీ వెట్లా ఉంటావో నాకు తెలియదు—ఎక్కడ ఉంటావో అంతకంటె తెలియదు. నీ వెట్లా ఉన్నా—ఎక్కడ ఉన్నా నా ప్రార్థనలు ఆలకించు. నీవేది ప్రసాదించినా నాకు పరమానందమే'

ఆమె మనసు మబ్బులేని ఆకాశం మాదిరిగా స్వచ్ఛంగా నిర్మలంగా ఉంది.

పవిత్రమ్మ తలారా స్నానం చేసి పిల్లవాడి పాలకోసం ప్రయత్నాలు చెయ్యటం మొదలు పెట్టింది.

(అయిపోయింది)

27—12—68

## క్రిస్మస్

క్రిస్మస్ క్రిస్మస్ క్రిస్మస్
క్రైస్తవ లోకపు పర్వదినమ్మో
క్రీస్తుదయించిన క్రిస్మస్
క్రిస్మస్ క్రిస్మస్ క్రిస్మస్!

పాపము పండిన భూలోకమ్మున
శాపగ్రస్థులగు పాపుల గావ
కన్నెమరియకు కడుపుపంటయై
జన్మమొందె మన ఏసుప్రభుండు!

శత్రువులందరి మిత్రుల చేసి
శాంతికి మార్గం చూపాడు
ప్రేమయె జగతికి జీవమంచును
ఆ ప్రేమను ప్రజలకు పంచాడు!

అనాధ జీవులకు అండగ నిల్చి
అమూల్య బోధలను చేశాడు
వర్గభేద రహితమ్ముగ నాతడు
స్వర్గానికి మార్గం చూపాడు!

పాప మెరుంగని ప్రభువు యేసుపై
పగను బూనినది కుటిల సమాజం
కాలుసేతులకు మేకులు కొట్టి
శిలువ పైన వ్రేలాడ దీసినది!

సమాధి నుండి మూడవ దినమున
సర్వోన్నతుడై బయటకు వచ్చి
సజ్జన లోకము చూచు చుండగా
స్వర్గారోహణ మొందెను ప్రభువు!

ధర్మోద్ధరణకు ధరణిని వెలసిన
కరుణామయుడు దయానిరతుడు,
దివ్యపురుషుడగు దీనబంధువు
క్రీస్తుదయించిన క్రిస్మస్ వేడ!

—గని సెట్టి

పెద్ద కథ

# ఆ అమ్మాయి



వేళ్ళపల్లి
వెంకట లక్ష్మీనారాయణ శర్మ

(గత సంచిక తరువాయి)

అయ్యా, తమరు వేరే అర్థం చేసుకున్నారు. మమ్మల్ని అపార్థం చేసుకోకండి. అసలు మీ రాడినట్లెవరాడ్తారు? అట్లా గన్నానని యిక్కడాడొద్దు. యింత సేపూ ఆడింది చాలు. ఈ రెండు క్షణాల్లో మీలో తొంభయిమంది పటౌడీలు, అరవై మంది జయసింహాలు కనిపించారు కదుటండీ; అందుకే మిమ్మల్ని మా క్రికెట్ కెప్టెన్‌గా ముందే నిర్ణయించుకున్నాం. మా యంగ్ మెంబర్సుకు మీరే గైడు. మావాడు పైన చెప్పిన మాటలన్నీ మీలాటి వాళ్ళకనేగాని మీకని కాదు. మీ రన్యథా భావించకూడదు. మీ గొప్ప తెలియనివాళ్ళ మయితే అంటాంకానీ తెలుసున్న మేం ఎట్లా అంటాం చెప్పండి ... అదిగాక మీ గురించి ఎప్పుడూ మావా (వో) నరుడు చెప్తూనే వుంటాడు...'

'వానరు డెవరు ? మీ పక్క నున్నాయనా ?' అన్నాడు ముసలాయన.

నరసింహం నవ్వుకుని చెప్పటం మొదలెట్టాడు.

'...అబ్బె మా యింటాయన లెండి... ఎప్పుడూ మీ జపంవే చేస్తూ వుంటాడు ... 'ఆహా...రామనాథంగారు ఏం స్పోరు ట్స్మన్' అంటూంటాడు ఆ కామినేని ఈశ్వరరావు గారికి వెయిట్ లిఫ్టింగు నేర్పింది కూడా మీరే నన్నట్లు గుర్తు ... మీ గురించి యింత వినే మీ దగ్గర కొచ్చాం.'

ముసలాయన ముఖంలో వది హండ్రెడ్ కాండిల్సు బల్బులు వెలిగినయ్. మీసాల మధ్య కాస్సేపు డాన్సు చేయించాడు నవ్వుని. డాన్సవ్వంగానే మొదలెట్టాడు.

'అయితే యిపుడే మీరు యీ అసోసియేషన్ స్థాపించటానికి కారణంఏవిటి ?' ... యీ ప్రశ్న వస్తుందని యిద్దర్లో ఎవ్వరూ అనుకోలేదు...

'అయ్యా మీరు పుట్టేటప్పటికి మేం పుట్టలేదు. అట్లా పుట్టినట్లయితే మీరు బాగా ఆడే రోజుల్లోనే స్థాపించి వుండేవాళ్ళం ... అసలివన్నీ జరిగితే ఈ ఎసోసియేషన్ పెట్టాల్సిన గతెందుకు ...' అనుకున్నాడు నరసింహం...మూర్తికి హఠాత్తుగా మొన్నటి ఎన్నికలలో ఓ ప్రతిపక్ష నాయకుడు చెప్పిన ఉపన్యాసం గుర్తుకొచ్చింది. నాయకుడు ప్రభుత్వం ఏమీ చెయ్యలేక పోతున్నదని ప్రభుత్వాన్ని దుయ్యబడుతున్నాడు. అలా దుయ్యబడుతూ ఒక చోట యిలా అన్నాడు.

'మన పిల్లలు కడుపునిండా తినటానికి తిండి, కట్టుకుంటానికి గుడ్డ, ఉంటానికి యిల్లు, ఆడుకోటానికి ప్లేగ్రౌండ్సు ఏర్పరచలేని ప్రభుత్వం ఎందుకు ? మరి ఆ ఫలానా దేశాన్ని చూడండి...' అనంగానే చప్పట్లమోత ఎక్కువైంది. మూర్తికా పాయింటప్పుడు నచ్చకపోయినా యిప్పుడిక్కడ వాడుకో వచ్చనుకున్నాడు. యిది నరసింహం సహాయం లేకుండా తను స్వంతంగా చెప్పే జవాబు. అందుకని మరీ సంతోష పడ్డాడు. దాంతో లావెక్కాడు. గుండీ విప్పదీసి కాలరు పైకి నెట్టుకున్నాడు. యివన్నీ ఒక్క క్షణంలో చేసి మూర్తి చెప్పటం మొదలెట్టాడు.

'అయ్యా, మాంఛి ప్రశ్న వేశారు ... నేను య్యా మాంఛి ప్రశ్న వేశారు. 'మాంఛి ప్రశ్న వేశారని' రెండుసార్లన్నాను అది గుర్తుంచుకోండి. యింతవరకూ విచారంలో మాత్రమే డయలాగుని లాగి రెండు సార్లంటం తెలుగుసినిమా సాంప్రదాయం. అందుకని నేను విచారంగా అన్నాననుకోకండి. సంతోషంలో కూడా రెండుసార్లు ఒకే డయలాగునవొచ్చు. అందుకే నేను రెండుసార్లన్నాను ... అసలీ యీ ఎసోసియేషన్ను మేము ఎప్పుడైతే రెండో ప్రణాళికలో 'యింటింటికో క్రికెట్టు బాట్' అనే స్కీము పెట్టినపుడే స్థాపిద్దాం అను

కున్నాం...కానీ తొందర పడటం మన స్వభావం కాదుకదండీ...మన ఫారిన్ పాలసీ నిండా యిలాంటి తొందరపడక పోవటాలు చాలా కన్పిస్తయ్యండి ...' అని 'మీకు నవ్వొచ్చిందాండీ' అన్నట్టు ముసలాయి నొంక చూసి నవ్వాడు మూర్తి. భావగర్భితంగా నవ్వాననుకున్నాడు. రామనాథంగారు ఏదో గ్రహించినట్లు తలవూపాడు. 'ఓహో' అన్నారు మళ్లీ. ఎందుకో ననుకున్నారు మిత్రద్వయం. యిందుక్కాదులే అని సరి పెట్టుకున్నారు. మూర్తి కొనసాగించాడు.

'సరే. మూడో ప్రణాళిక బయటకు రాంగానే ప్రతిపేజీ వెదికాం. కానీ అలాటి స్కీము ఎక్కడా కనిపించలేదు ... సరే నాలుగో ప్రణాళిక సంగతిదీ అని ఎవ్వరూ చెప్పటంలేదు... అందుకని ప్రభుత్వంమీద ఆధారపడితే లాభంలేదని రుజువు చెయ్యటానికి ఈ ఎసోసియేషన్ స్థాపించదల్చుకున్నాం' అంటూ వుపన్యాసం పూర్తి చేశాడు మూర్తి. నాయకుడిమాదిరే పొడి దగ్గు దగ్గాడు. అంటీ అంటకుండా చేతి వేళ్లతో అలల్లాగా తలమీద దువ్వుకున్నాడు. జేబు రుమాలుతో ముఖం అద్దుకున్నాడు...మూర్తి వుపన్యాసం ఆపి చాలా సేపయింది. ముసలాయన మాట్లాళ్లేదు ...కొంచెం సేపటికి—

'యిదన్నమాట మీ ఎసోసియేషన్ ఆశయం...ప్చ్ ... యీ రోజుల్లో గవర్నమెంటుని తిట్టటం, దానికి వ్యతిరేకంగా పన్చెయ్యటం గొప్ప పనులయ్యాయి ...' అన్నాడు. యిద్దరూ హడలిపోయారు.

'అయ్యా! తమరు పొరబడుతున్నారు. అసలు మా వుద్దేశ్యం ...' అంటూ కంగారుగా చెప్పబోయారు.

'చెప్పారుగా...ప్రభుత్వానికి వ్యతిరేకంగా పనిచేస్తారన్నమాట. ఎక్స్క్యూజ్ మీ ... నేను గవర్నమెంటాఫీసర్ని. ఐ డోన్ట్ జాయిన్ యువర్ ఎసోసియేషన్' అని కుర్చీలోంచి లేచాడు రామనాథంగారు. యిద్దరికీ కూడా లేవక తప్పిందికాదు ఆయన లోపలికి వెళ్లిపోయాడు. మూర్తిని రోడ్డుమీదికి లాక్కొచ్చాడు నరసింహం.

'ఒరేయ్ మూర్తీ! చక్కగా ఆకాలవలో కెళ్లి దూకు. ఏం తెగులొచ్చిందని ప్రభుత్వాన్నట్లా దుయ్యబట్టావ్.'

'గవర్నమెంటుని తిట్టాలనితిట్టాన్నట్రా. ఏదో నోటికొచ్చింది, బావుంది అనుకుని అనేశాను...ప్చ్...ప్లానంతా కొలాప్స్. ఆ అమ్మాయికూడా విన్నట్లుంది. ఏమనుకుంటుందో...ఛస్తారా...యింకా బ్రతకటం దేనికి'

'ముందే చెప్పానుగా... ఆవనే నయం... చావు' ప్రోత్సాహం యిచ్చాడు నరసింహం.

'యిదిట్రా నీ సలహా ?'

'ఆ...యిదే. యిట్లాచేస్తే నువ్వు మునలాడిమీద ప్రతీకారం కూడా తీర్చుకోవచ్చు హాయిగా చచ్చి దయ్యమైపోవట్ము. యింకో లాభంకూడా వుంది. దయ్యమైతే హాయిగా ఎవరికంటాపడకుండా వాళ్లింటికెళ్లొచ్చు. నా సహాయంకూడా అక్కర్లేదు. అందుకని హాయిగా చావు...చావు'

'హాస్యానికిదిట్రా సమయం...'అంటూ వాపోయాడు మూర్తి.

'ఔన్రోయ్...సమయానికి గుర్తుచేశావ్. వెధవ హాస్యానికి యిదా సమయం. యివాళ లీలామహల్లో మార్నింగ్షో వుంది. పోతా' నన్నాడు నరసింహం. అని మూర్తి భుజం తట్టాడు.

'లేవురా' అన్నాడు మూర్తి విసుగ్గా.

'నువ్వేం బాధపడకురా అబ్బీ! సినిమాకు వెళ్లొచ్చి నేనో ప్లాను వేస్తాగా చూద్దువుగాని' అని మళ్లీ తట్టాడు మూర్తి భుజం.

'అబ్బే, లాభం లేదురా. రూపాయికూడా లేదు' అన్నాడు మూర్తి. నరసింహం ఏమీ మాట్లాడకుండా భుజం తట్టితే 'అబ్బి, ఓ రెండియ్యి' అని అర్థం వరా మర్చిస్తూ తట్టితే 'పోన్లే ఓ రూపాయివ్వు ఎట్లాగోట్లా సర్దుకుంటాను ఏం చేస్తాం' అని అర్థం. రూపాయికూడా లేదన్నా నరసింహం బయల్దేరి వెళ్లిపోయాడు... మూర్తి రూంకు చేరుకున్నాడు.

కాస్సేపటికి యింటివా (వా) నరుడు వచ్చాడు. ఆయనపేరు ఆంజనేయులు.

'ఏంవయ్యా మూర్తీ! నేను మా వాళ్లింటికి పూళ్లోకి వెడుతున్నాను. సాయంకాలానికిగాని రాను. నువ్వో చిన్నపని చేసిపెట్టాన్స్...ఆ అరుగుమీద గులాబీమొక్క వుంచాను. నువ్వివాళ రూంలోనే వుంటావుగా... రామనాథంగారి పిల్లలు...అంటె ఆ కొత్తడాబా పిల్లలొస్తే యిచ్చెయ్... పాపం చాలారోజులయిందా గులాబీమొక్క అడిగి' అన్నాడు.

మూర్తి 'సరేనండి' అనగానే వెళ్లిపోయాడాయన. పిల్లలుఅంటె ఎవరొస్తారో ననుకుంటూ ఆలోచిస్తున్నాడు మూర్తి. 'వాళ్లదుర్గ కానిరాకూడదూ' అనుకున్నాడు. 'యిదేం సినిమాకాదుగా, అని మళ్లీ అనుకున్నాడు. దుర్గనుకనుక రప్పిస్తే కనకదుర్గకి కొబ్బరికాయ కొడతానని మొక్కుకున్నాడు... పన్నెండు గంటలయ్యింది... హోటలుకికూడ వెళ్లలేదు.

'ఆంజనేయలు గారున్నారండీ' అని బయటనుంచి వినిపించగానే కోకిల పాడినట్లనిపించింది మూర్తికి. మూర్తి బయటకొచ్చాడు. వరండాలో దుర్గ యింకో పదేళ్లకుర్రాడు నిలబడున్నారు:

మీరు ఆంజనేయులుగారి కోసం వచ్చారండీ?...' అన్నాడు మూర్తి.

'లేకపోతే ఎందుకడుగుతామండీ ఆయన్ను గురించి' అంది.

'గడుసు పిల్ల, జాగ్రత్త' అన్నాడు లోపలిమూర్తి.

'నువ్వూరుకోరా అసలే బెదిరిపోతుంటె యింకా అదరగొడ్తావ్' అని అనుకుని, పైకి—

'ఆయన లేరు...మీరు లోపలికి రావచ్చు' అన్నాడు.

'అక్కర్లేదు...ఆయనొస్తే పనుండొచ్చాం లేరుగా...వెళ్లిపోతాం' అంది.

యిహ లాభం లేదనుకుని మూర్తి ధైర్యం తెచ్చుకుని—

'మీతో చెప్పమని నాకు కొన్ని విషయాలు ఆయన చెప్పాడు' అన్నాడు. 'అలాగా' అని ఏంటన్నట్లు చూసింది.

'మీరేదో పూలచెట్లు కావాలన్నారుటగా అవి దొడ్లో వున్నయ్ యివ్వమని చెప్పి వెళ్లాడు...దొడ్లోకిపోదాం రండి' అంటూ దారితీశాడు మూర్తి...ముగ్గురు నడుస్తున్నారు...ఆఅమ్మాయిని మాటల్లోకి దించుదాం అనుకునే వేళ్ళకి మూర్తికి భయం వెయ్యటం మొదలెట్టింది...

'మీ పేరేంటండీ'...వెనకనించి వినిపించింది. మూర్తి ఆశ్చర్యపడి, కొంచెం సంతోషించాడు. 'ఏం చొరవ' అనుకుని 'నా పేరాండీ' అన్నాడు.

'మీ పేరేనండి! ...ప్రతిదానికి అలా గాభరా 'పడ్తారేం' అంది నవ్వుతూ.

# ఆ అమ్మాయి

'అబ్బే, 'గాభరా' ఎందుకేండీ ?!... మూర్తండీ నాపేరు' అన్నాడు. లేదనుకున్నా, అన్నా 'గాభరా' వస్తూనే వుంది.

'అది సరే,...పొద్దున మాయింటి కొచ్చినప్పుడు అంత కంగారు తిన్నారేం' క్రిందిపెదవిని మునిపంటితో నొక్కుతూ— నవ్వుతూ అంది.

'భలేవారే మీరు...నేను...నేను కంగారేం పడ్డాను. పడాల్సిన అవసరం ఏముంది ? మెంబర్‌షిప్‌కోసం వచ్చాను. కావాల్సిన పని చెప్పటానికి కంగారెందుకు?' అన్నాడు మూర్తి.

'మీరు వచ్చింది మెంబరుషిప్‌కోసం కాదు కదూ ?' అంది నవ్వుతూ... ఆలోచించకుండా అయితే మూర్తి—

'ఎందుకు కాదూ ?' అనేవాడే. కానీ ఆ అమ్మాయి చొరవ తీసుకునేసరికి మెదడు కొంచెం ఆలోచించటం మొదలు పెట్టింది...

'ఎందు కొచ్చానో మీకు తెలుసా ?' అన్నాడు మూర్తి చెట్టు కానుకుంటూ.'

'తెలుసు...కానీ యిప్పుడు చెప్పను. తర్వాత చెప్తాను. యీ కాగితంలో వున్నట్టు చెయ్యండి' అంటూ వో కాగితం యిచ్చి వెళ్ళబోయింది.

'అన్నట్టు ... గులాబీమొక్క తీసుకు పోరూ' అంటూ పూలమొక్క చేతికందించాడు, సినిమాలో పువ్వు యిచ్చే హీరోలా.

'మీరిచ్చేది గులాబీమొక్క ... గులాబీ పువ్వుకాదు' అంది దుర్గ, పూలమొక్కకు అంత పోజెందుకన్నట్లు నవ్వుతూ. మూర్తి కూడా నవ్వుతూ 'మీకు గులాబీపువ్వు తగిన ప్రెజంటు కాదు' అన్నాడు...

'బై, బై' అంటూ వెళ్ళిపోయింది దుర్గ.

* * *

వారంరోజుల తర్వాత. ఆదివారం... నరసింహం, మూర్తి మాచవరం దిగువలో వున్న చిన్న మామిడితోటలోకి చేరుకున్నారు, యిద్దరూ మామిడి చెట్టు క్రింద, బెడ్‌షీటు తీసిపరచి, వాటర్‌కాన్, ఎయిర్‌బాగ్ క్రింద పెట్టుకుని పేకాట మొదలెట్టారు ... నరసింహం మధ్యలో ఎన్నోసార్లడిగాడు—

'ఏంవిటిరా మూర్తి ! ఎప్పుడూ లేంది యివ్వాళ 'పిక్నిక్' అంటూ లాక్కొచ్చావ్' అంటూ.

'ఆగరా...నీకే తెలుస్తుంది కాస్సేపట్లో...మనప్లానేవిటనుకున్నావ్' అంటూ నవ్వాడు మూర్తి.

సాయంకాలం మూడు గంటలకు ఆతోట గేటుదగ్గర కారు హారన్ వినిపించింది. యిద్దరూ అటు చూశారు. దుర్గ, రామనాథంగారు, యిద్దరు కుర్రాళ్ళు కార్లో దిగారు.

'ఓరి ఐన్‌స్టీనూ ! నీకిదెట్లా తెల్సిందిరా' అన్నాడు నరసింహం ఆశ్చర్యపోతూ.

'ఉష్...అటు చూడకు. ఆటాడు' అన్నాడు మూర్తి.

వాళ్ళు వీళ్ళదగ్గరికి వచ్చి యింకా పైకి వెళ్ళుతూవుంటె యిద్దరూ 'గుడ్ యీవెనింగ్ సార్' అన్నారు. రామనాథంగారు వీళ్ళవంక చూసి గుర్తుకు తెచ్చుకుని 'గుడ్‌యీవెనింగ్' అంటూ ముందుకు సాగిపోయారు బలగంతో.

'ప్లాన్ కొలాప్స్' అన్నాడు నీరసంగా నరసింహం.

'కొలాప్సూ లేదు, నీ బొందాలేదు; యింకోగంటలో 'పాత్రో' మంటూ వస్తాడు మనదగ్గరకి' అని నవ్వుతూ వాటర్‌కాన్ వంక చూశాడు మూర్తి. నరసింహానికి ఏంవీ అర్థంకాలేదు. అయినా కొన్నైనన్ను మానేసి, కొన్నైను మార్కు మొహంతోనే ఆడటం మొదలెట్టాడు...

యిక తోటలో ఆమూల...రామనాథంగార్ని దుర్గ అడగటం మొదలెట్టింది — 'నాన్నగారూ, వాళ్ళెవరూ ? మీ ఆఫీసులో వాళ్ళా ?' అంటూ.

'ఎవరూ...ఆ కుర్రాళ్ళా ?...కాదమ్మా ...ఎపుడో మనింటికి ఏదో ఎసోసియేషన్లో చేరమంటూ వచ్చారు. అదీ పరిచయం... సరే చెస్‌బోర్డు తియ్యమ్మా...ఒరేయ్, మీ యిద్దరూ ఆమూలగా చెట్లో చేమలూ ఎక్కకుండా ఆడుకోండి ! అంటూ ఆట మొదలుపెట్టారు. ఆటాడుతూ దుర్గ మూర్తి వాళ్ళున్నవైపు చూడటం గమనించాడాయన. 'కుర్ర సన్యాసులు' అనుకుంటూ నవ్వుకున్నాడు...

'అమ్మాయ్...నీరాజు ఆఖరు...షా' అన్నాడాయన. దుర్గ వులిక్కిపడి ఆటలోకి వచ్చింది...కుర్రాళ్ళిద్దరూ ఆకలేస్తోందంటూ వచ్చారు...నలుగురూ టిఫిన్ తింటున్నారు.

'మంచినీళ్ళు కావాల'న్నారు కుర్రాళ్ళు. చుట్టుపక్కల చూసి 'అరె, వాటర్‌కాన్ తీసుకురాలేదు' అంది దుర్గ.

'కార్లో వుందేమో ? ... డ్రైవర్ని పిలుద్దాం' అంటూ 'రంగస్వామీ' అంటూ కేకపెట్టాడు రామనాథంగారు...డ్రైవరు కార్లో చూసివచ్చి 'లేద'న్నాడు.

'అయ్యో, నేనసలు కార్లో పెట్టటం






మర్చిపోయాను. కుర్చీలోనే మర్చిపో యొచ్చేశాం' అంది నెమ్మదిగా దుర్గ.

మంచినీళ్లు లేవనేసరికి కుర్రాళ్లకి దాహం యింకా ఎక్కువ అయ్యింది, 'మంచి నీళ్లం'టూ గోలచెయ్యటం మొదలెట్టారు. సమయం కనిపెట్టిన మూర్తి లేచి గ్లాసులో నీళ్లు పోసుకుని వాళ్లకు కనిపించేలా త్రాగసాగాడు. దుర్గ అటు చూసి—

'నాన్నగారూ! వాళ్లదగ్గిర మంచి నీళ్లున్నయ్. యిస్తారేమో' అంది.

'తీసు కొస్తా'నంటూ బయల్దేరాడు రామనాథంగారు.

'మిష్టర్స్, మీ దగ్గర మంచినీళ్లున్నయ్యా' అన్నాడు అతి వినయంగా.

'యస్ సర్, అన్నాడు' మూర్తి. 'మీకు కావాలా ?' అన్నాడు మళ్లీ.

'కావాలి, ముందు మా పిల్లలకి బాగా దాహం వేస్తుంది...టిఫిన్ తిన్నాక చూశాం ...తీరాచూస్తే మంచినీళ్లుతేవటం మర్చిపోయాం.'

'అయ్యో...పాపం, వాళ్లకి గొంతు పట్టేసిందేమో ? తొందరగా తీసుకుపోదాం' అంటూ వాటర్‌బాగ్ తీసుకుని పరుగెత్తాడు—మూర్తి. ముసలాయనకంటె ముందే చేరుకున్నాడు...నలుగురూ మంచి నీళ్లు త్రాగారు.

'థాంక్యూ మిస్టర్...' ముసలాయన ఆగాడు.

'నాపేరు మూర్తండీ' అన్నాడు మూర్తి.

'థాంక్యూ మిస్టర్ మూర్తీ! నిజంగా మీరు చాలా హెల్పు చేశారు.'

'అబ్బే, దాందేముందండీ' అన్నాడు అతి వినయంగా మూర్తి.

'వస్తానండీ' అంటూ బయల్దేరబోయాడు మూర్తి.

'ఎక్కడికి పోతావయ్యా...మీ ఫ్రెండుని కూడా పిలు యిక్కడికే. కాస్సేపుండిపోదాం' అన్నాడాయన.

నరసింహం కూడా చేరాడు యిక్కడికి. వీళ్లిద్దర్నీ కూడా టిఫిను తీసుకోమని బలవంతం చేశాడాయన...

టిఫిన్ తిన్నతర్వాత నల్గురూ పేకాట్ట మొదలెట్టారు...ఆటలో మూర్తి, దుర్గ ఎందుకో నవ్వుకుంటున్నారు. ముసలాయన వాళ్లవంకచూసి 'ఓహో' అని నవ్వుకున్నాడు. తర్వాత ఒవీ, యివీ, వాటిమధ్య మూర్తి తల్లిదండ్రుల్ని గురించి మాట్లాడి, మాటల్లో మాటగా నరసింహం గురించి కూడా అడిగాడు...చీకటి పడుతూండగా మూర్తి, నరసింహం—

'మేం యిక వస్తామండీ' అన్నారు.

'మీరెక్కడయ్యా వుండేది ? దాపేటీ దగ్గర్లోనా?' అన్నాడాయన.

'కాదండీ! మీ బజార్లోనే' అన్నారు మిత్రద్వయం.

'అలాగా ... అయితే యింకేం మన కార్లోనే పోదాం' అని.

'రంగస్వామీ! ఈ సామాన్లన్నీ కార్లో పెట్టు' అన్నాడు...

...'మిస్టర్ నరసింహం మనం యిలా

ముందు 'సీట్లో కూర్చుందాం రావోయ్' అని నరసింహాన్ని తీసుకుని ముందుసీట్లో కూర్చున్నాడు ముసలాయన. మూర్తి, కుర్రాళ్ళూ, దుర్గ వెనకాల కూర్చున్నారు...కారు ఏలూరురోడ్డువదిలి ప్రక్కకు తిరిగింది...కారు వంతెనమీదనుంచి పోతూంటేగా మెల్లగా అన్నాడు మూర్తి —

'ఇంకా ఎన్నాళ్ళు మనకీబీటు ఈ వంతెనమీద' అని.

'ఇహనించి యిక్కడకాదు. అక్కడే' అంటూ నవ్వుతూ డాబావైపు చూపించింది దుర్గ...కారు డాబాముందు ఆగింది.

* * *

# ఆ అమ్మాయి

కాఫీ కప్పు క్రిందపెడుతూ నరసింహం అన్నాడు: 'శేఖర్...మనం బెజవాడలో వున్న రోజుల్లో సంగతులు చాలా బాగా రాశావు.'

'ఆ మేగజైన్లో కథ చదివావా?' అన్నాడు శేఖర్.

'ఆ...నీ పేరు మార్చితే కనుక్కోలేననుకున్నావా?... సరేకానీ చివరికా కథలో కొంత 'కథ' కూడా రాశావెందుకు? నువ్వా అమ్మాయిని ప్రేమించావని నాకు తెల్సు; ఆ అమ్మాయి కూడా తెల్సు. అట్లాగే ఆ అమ్మాయిని అలా రోజూ వంతెన మీద నుంచి చూడటం తప్ప ఎన్నడూ మాట్లాడలేదని కూడా నాకూ తెల్సు; ఆ అమ్మాయికీ తెల్సు. అలా 'యినీషియేటివ్' తీసుకోనకపోవటం నీ తప్పని కూడా నాకు తెల్సు. ఏ ఆడపిల్లా కూడా ఆమె యిచ్చిన 'రెస్పాన్సు' కంటె ఎక్కువ యివ్వదు. తర్వాత ముందుకు పోవాల్సింది మగవాడు. ఆ పని నువ్వు చెయ్యలేదు. నువ్వు చెయ్యదల్చుకున్న వేళ్టికి ఆ అమ్మాయికి పెళ్లి నిశ్చయం చేశారు. తర్వాత కొన్నాళ్ళకే ఆ అమ్మాయి మరొకరి సొత్తయింది. అలా జరిగిన నిజాన్ని నీ కథలో యింకో విధంగా చూపించావ్. నీ వుద్దేశ్యంలో ఆ అమ్మాయి నువ్వు కథలో రాసినట్టు చొరవ తీసుకోక పోవటం ఆమె తప్పు అనా?' అన్నాడు.

కథంతా చదివి మేగజైనుని టేబిలు మీద పడేశాడు నరసింహం. లోపల్నుంచి స్నానం చేసి బనీను తొడుక్కుంటూ డ్రాయింగు రూంలో కొచ్చాడు శేఖర్ ... శేఖర్ భార్య లక్ష్మి వచ్చి టేబిలు మీద కాఫీ కప్పులుంచి లోపలి కెళ్ళింది.

'కాఫీ తీసుకోరా, సింహం!' అంటూ నరసింహం ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు శేఖర్.

రాజమండ్రిలో రైల్వేలో పనిచేస్తున్న నరసింహం శేఖర్ని చూసేందుగ్గాను బందరు వచ్చాడు. శేఖర్ బందరులో కామర్సు లెక్చెరర్గా పని చేస్తున్నాడు. తను పని చేసే కాలేజీ మేగజైనుకి శేఖర్ ఒక కథ వ్రాసి యిచ్చాడు. శేఖర్ స్నానం చేసేకి లోనికెళ్లిన దగ్గర్నుంచి యింతవరకూ ఆ కథే చదువుతూ కూర్చున్నాడు నరసింహం.

శేఖర్ భారంగా నిట్టూర్చాడు:

'నర్సూ! ఆమె తప్పని నేనటంలేదు. యిది నాలోని పిరికితనమే. నాకిప్పుడు ఆశ్చర్యం వేస్తోంది. 'ఆ రోజుల్లో ఆడవాళ్ళతో మాట్లాట్టానికంత బిడియం ఎందుకొచ్చేదా' అని. ఆమెతో యింకో తడవ కూడా మాట్లాడే అవకాశం వచ్చింది. అదెప్పుడంటె — ఆరేళ్ళ క్రితం నేను వాల్తేరులో ఎం.కాం చదివే రోజుల్లో. ఆ అమ్మాయి కాన్వొకేషను కొచ్చింది. అప్పుడూ అదే బిడియం. యిలా అంటె అందరూ నవ్వుతారు. కానీ నిజం యిదే. నీకూ తెల్సుగా.'

'నాకు తెలియకేం...కానీ మీ యిద్దరిదే నాకు ప్రపంచంలోకెల్లా విచిత్రమైన ప్రేమగా కనిపిస్తోంది. ప్రేమించుకున్నారు; కాని మాట్లాడుకోలేదు... యిది చాలా ఆశ్చర్యకరమైన విషయం.'

'అందుకే కథలో అట్లా వ్రాశాను. జీవితంలో నేను ఏదయితే కోరుకున్నానో దాన్ని సాధించటానికి సకాలంలో ప్రయత్నించలేక పోయాను. అది నా బలహీనత. దానికి జీవితాంతం బాధపడూతనే వుంటాను. కానీ కథలోనన్నా యింకోవిధంగా — నేను కోరుకొన్న విధంగా — జరిగినట్లు వ్రాసి ఒక్కొక్కప్పుడు చూసుకుంటె కొంతైనా మనశ్శాంతి వుంటుంది... కానీ నా కోరికల్లా వక్కటె — ఎక్కడో ఒకచోట ఆ 'అమ్మాయి' అలా గులాబీలా నవ్వుతూనే వుండాలి. అలా వుంటూ వుంటుందనే నా వుద్దేశ్యం' అన్నాడు శేఖర్.

'యిప్పటికీ 'అమ్మాయి' అనే అంటున్నావ్గానీ పేరుతో వుదహరించవేం? ఆ రోజుల్లో ఆ 'అమ్మాయి' పేరు నీకు తెలియదని నాకు తెల్సు. తర్వాతనైనా తెల్సుకున్నావా?... లేకపోతే కథలో వ్రాసినట్లు 'ఆ అమ్మాయి' పేరు 'దుర్గే'నా?' అన్నాడు నరసింహం.

'కాదు...'ఆ అమ్మాయి' పేరు 'దుర్గ' కాదు. నాకిప్పటికీ అ 'అమ్మాయి' పేరేమిటో తెలియదు. రెండుమూడు సార్లు బెజవాడ కూడా వెళ్ళాను. కానీ యిప్పుడు వాళ్ళ వాళ్లెవ్వరూ బెజవాడలో లేరు ... కథలో మాదిరి ఏ రైల్లోనో కల్సుకుంటామేమో తెలియదు. ఒకవేళ కలిసినా ఏమని పిలవాలి?...నాకామె పేరు కూడా తెలియదు' అంటూ కళ్ళు వ్రేళ్ళతో నొక్కుకుంటూ కుర్చీలో వెనక్కి వ్రాలడు లెక్చెరర్ శేఖర్.

(అయిపోయింది)





'గ్రామదేవతలు'లో రాజసులోచన, చలం, ధూళిపాళ, జగ్గయ్య. ఉషాకుమారి.

<u>చిత్రసమీక్ష.</u>

# గ్రామదేవతలు

'కంచే చేను మేసినప్పుడు ఏం చెయ్యాలి? కంచెని తెగనరకాలి. మరి చేనుని పశువులు మేసేస్తే? ఫరవాలేదు. పశువులు చేనుని పూర్తిగా మెయ్యవు, కంచే మేయడం వస్తే సర్వనాశనం చేసేస్తుంది.' —ఇవి గ్రామదేవతల చిత్రంలో చిన్న పిల్లలు చెప్పిన పెద్ద మాటలు. గ్రామదేవతలు గ్రామానికి రక్షకులు. వారే భక్షకులుగా మారినప్పుడు గ్రామమేమవుతుంది? అన్న ప్రశ్నకి సుంగధీ పిక్చర్స్‌వారి గ్రామదేవతలు సమాధానం చెబుతుంది.

చిత్రంలో కథా వస్తువు చాలా గొప్పది. 'ఇన్‌స్పెక్టర్ జనరల్' పేరుతో ప్రచారం పొందిన కథే ఇది. ఈ కథని చలన చిత్రంగా విడుదల చెయ్యాలని నిర్మాతలు ఉత్సాహంగా పని చేసినట్టు చిత్రం పొడవునా కనిపిస్తుంది. ప్రజారంజకం కావాలని చేసిన చేర్పులూ కూర్పులూ మెరుగ్గానే వున్నాయి. అయితే చిత్రీకరించిన విధానంలో మాత్రం సమర్థత కనిపించదు. వాటికి ఎన్నయినా కారణాలుండొచ్చు. అది ప్రేక్షకులకి అనవసరం కదా! విద్యార్థులు—రాజకీయాలు గురించికూడా ప్రజలకి ఒక రకమైన అభిప్రాయాన్ని కలగజేస్తుందీ చిత్రం.

ఇది ఒక గ్రామ పంచాయతీకి సంబంధించిన గొడవ. గ్రామం ప్రసక్తి రాగానే మునసబు కరణాలు జ్ఞాపకం వస్తారు. కాని—ప్రెసిడెంటు, ఇంజనీరు, కంట్రాక్టరు, డాక్టరు, హెడ్‌మాస్టర్ల మీదే కథ నడిపించారు. అవినీతికి ఎక్కువ దోహదమిచ్చే పాత్రలు ఇవి గనక, వీటిని సృష్టించి ఇతివృత్తానికి చక్కని న్యాయం కూర్చారనే చెప్పాలి. సంభాషణలు కూడా తాజా రాజకీయాలపై వ్యంగ్యధోరణితో సాగాయి. పంచాయతీలో అవినీతిని ఆరా తియ్యడానికి ఒక స్పెషలాఫీసరు రావడం, ఆ స్పెషలాఫీసరు పేరుతో మరొకతన్ని పంచాయతీవారు సన్మానించడం కథకే ఆయువుపట్టు.

చిత్రం మొత్తంమీద ప్రేక్షకుల మనసులో మెదిలే పాత్ర చలానిది. అతను అవకాశాన్ని చక్కగా వినియోగించుకో గల్గాడు. కథానాయికా నాయకులుగా ఉషాకుమారి, జగ్గయ్య నటించారు. తదితర ముఖ్యపాత్రలని రేలంగి, అల్లు రామలింగయ్య, ధూళిపాళ, రాజబాబు, రాజసులోచన, గిరిజ మొదలైనవారు పోషించారు.

సంగీతం పెండ్యాల. రచన పాలగుమ్మి పద్మరాజు. దర్శకత్వం సి. యస్. రావు. నేడు కొన్ని పంచాయతీల్లో జరుగుతున్న అక్రమాలని సోదాహరణంగా చూపిస్తూ గ్రామాల అభ్యుదయానికి చేయూతనిచ్చే 'గ్రామదేవతలు' చిత్రానికి నిర్మాతలు బాబు అండ్ బాబు.

—సికరాజా ●

# సినిమా డైరీ

● భారతి పిక్చర్స్ "మహాబలుడు" చిత్రానికి సంబంధించిన ట్రిక్ ఫైటును రవికాంత్ నగాయిచ్ డిసెంబరు 10న వాహిని 5వ ఫ్లోర్‌లో చిత్రీకరించాడు. హీరో కృష్ణ పాల్గొన్నాడు.

● దాశరథి వ్రాసిన "చిరుచేదు పానీయము, చింతలను మరిపించునే" అనెడి పాటను, "ముహూర్తబలం" చిత్రానికిగాను సుశీల పాడగా కె. వి. మహదేవన్ డిసెంబరు 10న గోల్డెన్‌లో రికార్డు చేసాడు.

● లక్ష్మీనారాయణ పిక్చర్స్ నిర్మిస్తున్న జానపద చిత్రం యొక్క షూటింగు డిసెంబరు 13 వాహినిలో ప్రారంభమైంది. జయలలిత, రామారావులు పాల్గొన్న సన్నివేశాల్ని విఠలాచార్య డైరెక్టు చేసాడు.

● సారథి స్టూడియోలో డిసెంబరు 1 నుండి 10 వరకు జరిగిన షూటింగులో చిత్రంలోని ముఖ్య నటీనటులందరూ పాల్గొన్నారు. వి. మధుసూదనరావు దర్శకత్వం వహించే యీ చిత్రానికి డి. మధుసూదనరావు నిర్మాత.

# ట్రిక్ ఫొటోగ్రఫీ

కెమెరామన్‌ని నాలుగు భాగాలుగా విభజించవచ్చును. ఒకటి— కవిగా కెమెరామన్. రెండు — చిత్రకారుడుగా కెమెరామన్. మూడు— డాక్టర్ ఆఫ్ బ్యూటీగా కెమెరామన్. నాలుగు— మెజీషియన్‌గా కెమెరామన్. ఇప్పుడు మనం ట్రిక్ ఫొటోగ్రఫీని గురించి చెప్పుకుంటున్నాం కాబట్టి — మెజీషియన్‌గా కెమెరామన్ అనే అంశాన్ని తీసుకుందాం. మెజీషియన్‌కి, కెమెరామన్‌కి చాలా దగ్గర పోలికలున్నవి. కళ్లను కట్టి తంత్రాలు చేస్తాడు మెజీషయన్. లెన్స్‌ని మాయచేసి తంత్రాలు చేస్తాడు కెమెరామన్. కన్నుమూడలేనిది లెన్స్ చూస్తుంది.

## మెజీషియన్‌గా కెమెరామన్

దూరంగా ఒక పొగగొట్టం ఉందనుకోండి. కంటిముందు ఒక చిన్న పెన్సిలు పెట్టుకు చూస్తే — అంతపెద్ద పొగగొట్టమూ కనుమరుగవుతుంది. కనుక కంట్లో లోపం ఉందన్నమాట! కంట్లో ఉన్న లోపాన్ని మెజీషియన్ ఎలా గ్రహిస్తాడో, లెన్స్‌లో ఉన్న బలహీనతను ఛాయాగ్రాహకుడు అలా గ్రహిస్తాడు. తాంత్రిక ఛాయాగ్రహణానికిది ప్రాథమిక సూత్రం! మెజీషియన్‌కీ, కెమెరామన్‌కీ పోలికలున్నవని అన్నది అందుకే!

## భూకంపాలు

భూకంపాలు వచ్చి — భూమి ముక్కలు ముక్కలుగా విడిపోయినట్లు చూపిస్తుంటారు కదా, ఇది ఎలా సాధ్యం? అని అడుగుతుంటారు చాలామంది......భూమి, చెట్లు మినియేచర్ వేస్తారు. గాలి, చలనం, ఉరుములు, మెరుపులు—ఇందులో ముఖ్యాంశాలు. 1 అడుగు = 2 అంగుళాలు అంటే 1/6 కి తగ్గుతుంది. కెమెరా సాధారణంగా 24 ఫ్రేమ్స్‌లో రన్ అవుతుంది. ఒక వస్తువుని 1/6 కి తగ్గించదలచుకుంటే 6 టైమ్స్ పెంచుతారు. సెకండ్‌కి 24 ఫ్రేమ్స్ కాబట్టి 24 × 6 = 144 ఫ్రేమ్స్ రన్ చేస్తారు. అప్పుడు ఆ వేగంలో టేబుల్ మీద ఉన్న మినియేచర్‌ని బద్దలు కొట్టవచ్చును. దాని మీద గాలి, చలనం వచ్చినవి గనుక, ఉరుములు, మెరుపులు రెండవసారి తీసుకుంటారు. తర్వాత ఆ రెండూ కలిపితే ప్రళయ భీభత్సంతో భూకంపం వచ్చినట్లు ఉంటుంది.

## బాణంతో బాణం దెబ్బలాడటం ఎలా?

ఎనిమేషన్ అనే విధానం ఇందుకు ఉపయోగిస్తాడు, కెమెరామన్. ఎడమనుంచి కుడికి ప్రయాణాన్ని విభాగించి ఏర్పాట్లు చేసుకోవటం జరుగుతుంది. వస్తువు వేగాన్ని బట్టి వాటిని ఇన్ని అడుగులకని డివైడ్ చేసుకుని అనుకున్న ప్రకారం తనకు కావలసిన విధంగా అమర్చుకుంటూ వస్తాడు కెమెరామన్.

## ద్విపాత్రాభినయం

ఒకచోట మనిషిని నించోబెట్టి కెమెరా లెన్స్‌ని సగం మూసి, అందులో ఒక వ్యక్తిని ఫొటోగ్రాఫ్ చేసి తీసిన భాగాన్ని మళ్లీ మూసి; తియ్యని భాగాన్ని తెరచి అదే వ్యక్తిని మళ్లీ ఫొటోగ్రాఫ్ చెయ్యటం— ద్విపాత్రాభినయానికి ఉపయోగిస్తున్న పాత పద్ధతి. ఇందులో అంటే ఈ విధానంలో రెండు శరీరాలూ దగ్గరికి రావు; చేరలేవు. ఒక మనిషి శరీరాన్ని ఇంకో మనిషి తలకు అతికించి, పక్కన అదే తలగల మనిషిని పెట్టి తీయటం ఆధునిక విధానం. మొదట శరీరాన్ని ఎక్స్‌పోజ్ చేస్తారు తర్వాత తలను తీసుకొచ్చి సిరీస్ ఆఫ్ టెస్ట్స్ తీసి, మేచ్ అయ్యేలా చూసి తీస్తారు. ద్విపాత్రాభినయంలో ఈ ఆధునిక విధానాన్ని ప్రసిద్ధ నటుడు శ్రీ యన్. టి. ఆర్. వీరాధ— ఈరకరామా వారు ఇపుడు నిర్మిస్తున్న సాంఘికంలోను, డి. వి. యస్. వారి జానపదంలోను, కెమెరామన్ శ్రీ ఎస్. ఎస్. లాల్ ప్రవేశపెడుతున్నారు.

ఆడిటోరియంలో మెజీషియన్ ప్రేక్షకుల కంటినీ మనసునీ ఎలా కంట్రోల్ చేసి వాళ్లకి తంత్రాలు చూపిస్తాడో; కెమెరామన్ అలాగే లెన్స్‌నీ, మోటర్‌నీ కంట్రోల్ చేసి ట్రిక్స్ చూపిస్తాడు.

—మోహన్‌కుమార్ ●

[ట్రిక్ ఫొటోగ్రఫీ విషయ సేకరణకు తోడ్పడిన — ఛాయాగ్రహణ పోకడల్లో కొత్తపుంతలు తొక్కుతున్న యువ ఛాయాగ్రాహకుడు శ్రీ ఎస్. ఎస్. లాల్‌కి కృతజ్ఞతలు.

వ్యాసకర్త.



'భలే రాజా'లో రాజశ్రీ, హరనాథ్

# సినిమా

■ గోల్డెన్ స్టూడియోలో మీనాకుమారి అట్లు కాలుస్తోంది; వాటిని నేనుకూడా రుచి చూడాలనుకుని ఆమె దగ్గరికి వెళ్ళాను; నేను పోయే సరికే చాలామంది వచ్చి అట్లను తిని అప్పు చెప్పిపోవడాన్ని చూశాను; అందరికీ అరువు యిస్తే ఆమెకు యెలా గడుస్తుంది అని ఆలోచించ సాగాను; ప్రతిరోజూ ఆమె అట్లనుతిని యెక్కువ బాకీ పెట్టినవాడు రాజబాబు; మీనాకుమారి వ్యాపారం దివాలా తీసేందుకు కారకుడయ్యాడు. ఒక్కుమ్మడిగా సైకిలు దిగివచ్చిన రాజబాబు, మీనాకుమారిని యిలా అడగసాగాడు.

రాజబాబు : రెండట్లు వెయ్.

మీనాకుమారి : గొంతు పిసుక్కు సచ్చినా నల్లి పైసా అరువు పెట్టనన్నాడు, సుబ్బిసెట్టి; సినోటి పోతురాజు అందర్నీ మేపి నాను దివాలా తీసాను.

రాజబాబు : విడుస్తున్నావా కన్నమ్మా? ఆ సెట్టికెన్ని పైసలియ్యాలి ?

మీనా : వంద.

రాజ్ : వందసా ! సరే ... తీస్కొస్తా ఉండుర్రి. అని సైకిలుపై రివ్వున వెళ్ళిపోతాడు; ఈ సన్నివేశం రవిచిత్ర నిర్మిస్తున్న తొలిచిత్రంలోది; వై. వి. రావ్ కథకు మహారథి సంభాషణ వ్రాసిన యీ చిత్రాన్ని సుబ్బరామదాసు డైరెక్టు చేస్తున్నాడు; దాసుకు సహాయకుడిగా అంజిబాబు, దుస్తులను నారాయణరావు, ఆర్టును చలం, సంగీతాన్ని సత్యం నిర్వహిస్తున్నారు. వై. వి. రావ్ నిర్మిస్తున్న యీ చిత్రం ఆంధ్రాలో పూర్ణాపిక్చర్స్ విడుదల చేస్తారు; డిసెంబరు 20,21 తేదీల్లో రవిచిత్ర యూనిట్ ఔట్‌డోర్‌కు వెళ్తున్నారు; కృష్ణ, విజయనిర్మలకు సంబంధించిన పాటలను చిత్రీకరిస్తారు.

* * *

గోల్డెన్‌నుండి వాహినికి వెళ్ళిన నాకు విజయనిర్మల ఆర్తనాదం వినిపించింది; ఏమిటీ నినాదం అని ఆలోచించు కుంటూ మొదటి ఫ్లోర్‌లోకి అడుగు పెట్టాను; అక్కడ కాంతారావు శిలారూపంలో నిలబడి వున్నాడు; విజయలలిత కోపంగా నిలబడి వుంది; ధూళిపాళ, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి సీరియస్‌గా కూర్చునివున్నారు.

విజయనిర్మల విలవిలా యేడుస్తూ న్యాయం కోసం ఆరాట పడుతోంది; విజయనిర్మల ఏడ్పుకు కారణమేమిటి ? కాంతారావు ఆమెకు యేమవుతాడు? అతగాడు శిలగా యెలా మారాడు ? అనే ప్రశ్నలకు సురేష్ పిక్చర్స్ 'బొమ్మలు చెప్పినకథ' సమాధాన మిస్తుంది. కె. వి. శ్రీనివాసన్ వ్రాసిన కథకు, సముద్రాల జూనియర్ సంభాషణలు వ్రాసాడు; వేణు మనకు వీనుల విందయిన సంగీతాన్ని విన్పిస్తున్నాడు. కాంతారావు, కృష్ణ, విజయనిర్మల, విజయలలిత, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, ధూళిపాళ, రాజబాబు, సంధ్యారాణి, రమాప్రభ ముఖ్య పాత్రలను పోషించే యీ జానపద చిత్రాన్ని విశాలాంధ్రలో నవయుగా విడుదలచేస్తారు. ఈ చిత్రంలోని దేవకన్యల పాత్రలను జయంతి, రాజసులోచన మొదలగు నటీమణులు పోషించగలరని నిర్మాత రామానాయుడు వెల్లడించాడు.

* * *

'ఆడపడుచు', 'కథానాయకుడు' చిత్రాలకు నిర్మాణ నిర్వాహకుడిగా వుండే ఆనంద మోహన్ యిప్పుడు నిర్మాత అయ్యాడు, ఎ. ఎల్. ఎం. అనేడి సంస్థను స్థాపించాడు; మలయాళంలో విజయవంతంగా ప్రదర్శింపబడ్డ 'ఉద్యోగస్థ' చిత్రం యొక్క హక్కులను కొన్నాడు; ఆదుర్తి నరసింహమూర్తిని దర్శకుడిగా పెట్టాలను కుంటున్నాడు; కథానాయికగా జముననుగానీ, కె. ఆర్. విజయనుగానీ పెట్టుకో దల్చినట్టు యిటీవల నేను కలిసినప్పుడు చెప్పాడు.

**అప్పట్లో ఆరయితే**
**ఇప్పుడు రెండే**

వాహిని స్టూడియోలో ఢప్ ఢప్ తుపాకీ శబ్దం వినిపించింది; ఆ మోత నా గుండెల్లో దడదడ శబ్దాన్ని యేర్పరిచింది; అప్పుడే నాకు



'ఎవరు మొనగాడు'లో రాజశ్రీ, రామ్మోహన్.

ఎదురు వచ్చిన వైకుంఠ రామశర్మను 'ఇదేమిటండీ, ఈ స్టూడియోలో తుపాకీశబ్దం వస్తుందే? దీన్నిగూర్చి మీకేమన్నా తెలుసా' అని అడిగాను. 'నాకు తెలియకేం; నేను అక్కడినుండేగా రావడం' అన్నాడు. 'ఎక్కడ? ఎందుకు?' అని ప్రశ్నించాను. 'మీరే వెళ్ళిచూడండి' అని నన్ను రెండవఫ్లోర్‌కి దారి తీయించాడు. ఫ్లోర్‌లోకి వెళ్ళాను. అక్కడ ఎన్. టి. రామారావు తన చేతిలోవున్న గన్‌తో డప్ డప్ అంటూ కాల్చి పారేస్తున్నాడు; ఆయన నిల్చున్న స్థితిని, ఆయన కాలుస్తున్న పద్ధతిని చూచి ముక్కుమీద వేలు పెట్టుకున్నాను. అసలు రామారావు చేతిలో తుపాకీ యెలావచ్చింది? ఒకవేళ వచ్చినా యెవర్ని కాల్చాడు? అన్నవి సందేహాలుగా వుండిపోకూడదంటే డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న జానపద చిత్రం చూడండి; మీ అభిమానాన్ని చూరగొంటున్న విఠలాచార్య ఈ చిత్రానికి దర్శకుడు; డి. వి. ఎస్. రాజు నిర్మించే ఈ చిత్రంలో యువరాజు జయంతుడిగానూ, పల్లెబైతు రాజాగానూ ఎన్. టి. ఆర్. ద్విపాత్రాభినయం చేస్తున్నాడు. నాయిక యెవరని అడగరేం? అందాలతార జయలలితే. ఈ చిత్రంయొక్క షూటింగు డిసెంబరు 8 నుండి 12 వరకు జరుగుతుంది; 13 నుండి లక్ష్మీనారాయణ ప్రారంభమవుతుంది అని చెప్పిన విఠలాచార్యను 'మీ స్వంత చిత్రం సంగతి యేం చేసారు?' అని అడిగాను. 'జనవరి 29 నుండి షూటింగు జరుగుతుంది' అని వివరిస్తూ నాయకీ, నాయకులుగా జయలలిత, రామారావులు నటిస్తారని, మిగతా పాత్రలను విజయలలిత, యడవల్లి రమ, రామకృష్ణ ధరించవచ్చునని వెల్లడించారు; పిక్చరు సంగతి అలా వుంచి మీ ఆరోగ్యం యెలావుంది అని ప్రశ్నించాను. ఇప్పుడు కొస్త మెరుగ్గా వుంది అంటూ సిగిరెట్టు ముట్టించారు. అయితే యింకా మీరు స్మోక్ చేస్తున్నారా? మరి డాక్టర్లు కూడ దన్నారుగా అని అడిగాను. 'అది లేకపోతే కుదరదండీ. అప్పట్లో రోజుకి ఆరు పెట్టెలు కాల్చేవాడ్ని. ఇప్పుడు రెండింటికి వచ్చాను' అని వివరిస్తూ ప్రస్తుతం తాను

# సినిమా

కాయకల్ప వైద్యం తీసుకొంటున్నట్లు వెల్లడించారు

**'ఇంతా చదివి—ఇల్లరికమా!'**

అక్కడినుంచి ప్రసాద్ స్టూడియోస్‌కి వెళ్ళాను. ఆ రోజు అక్కడ జరిగినది మీకూ చెప్తాను. పద్మనాభం, రాజబాబు ఇల్లరికపు టల్లుళ్ళు.

'ఇల్లరికంలోని మజా అది అనుభవించితే తెలుసునులే!' అనేడి పాటను రాజబాబు పాడుతుంటాడు. 'పద్మనాభం తన ప్రక్కనే వున్న రాజకుమార్‌ను 'ఒరేయ్, పక్కింటివాళ్ళ లక్షాధికార్లేమిటి?' అని ప్రశ్నిస్తాడు; 'అందుకే కామోసు. నౌకరు వెధవకూడ అలా వెలిగిపోతున్నాడు; వాడి పాట, వాడి డ్యాన్సు.' అని యింకా యేదో చెప్పబోతుంటే 'అయ్యబాబో! సంపేశారు; ఆరు నౌకరు కాదండి! అల్లుడుగారు' అని రాజకుమార్ జవాబిస్తాడు. ఆ సమయానికి రాజబాబు అక్కడికి వస్తాడు; రాగానే యిద్దరూ కరచాలనం చేసుకుంటారు. ఆ పైన వాళ్ళిద్దరిమధ్య జరిగిన సంభాషణను మీరు తెల్సుకోకపోతే యెలా?



'కథానాయకుడు'లో జయలలిత.

పద్మనాభం: వాట్, యింగ్లీషుకూడ వచ్చు నన్నమాట.

రాజబాబు: ముఝే హిందీ భీ మాలూమ్ హై!

పద్మనాభం: అప్పో తమిళం కూడ తెరియుమా!

రాజబాబు: తెరియుమే.

పద్మ: కన్నడం గొత్తా?

రాజ: అదొకటే కొత్తది.

పద్మనాభం: మరేమయ్యా యింత చదువుకున్న వాడివి కదా! పూలరంగడిలా వుండాలిగానీ — ఇల్లరికం వచ్చి, ఆత్మగౌరవం చంపుకొని—యిల్లా కూచుంటే లాభంలేదు. సంసారాన్ని తెలివితేటలతో సరిదిద్దుకోవాలి.

రాజబాబు: చూడు, పద్మనాభం! కొత్తలో నేనూ వెలిగాను; కొందరు నన్ను జల్సారాయుడు, అసాధ్యుడు, దేవాంతకుడు అన్నారు. రోజులు మారాయి — యిప్పుడు సుడిగుండాల్లో పడిపోయాను.

పద్మనాభం: దిగాలుపడకు! ధైర్యంగా వుండు.

రాజబాబు: నీకే తెలుస్తుంది! నీకూ ఈ స్థితి వస్తుంది.

పద్మనాభం: ఛా! ఎప్పటికీ మనం నీలాగా చెయ్యం! చూస్తావుగా మన తడాఖా! అని కాలరు యెగరేస్తాడు.

ఈ తమాషా సన్నివేశాన్ని 'కథానాయకుడు' చిత్రానికి గాను కె. హేమాంబరధరరావు చక్కగా చిత్రీకరించారు. జయలలిత, రామారావు నాయిక, నాయకులుగా నటిస్తున్న ఈ చిత్రంలో ప్రభాకరరెడ్డి, నాగభూషణం, మిక్కిలినేని, అల్లు రామలింగయ్య, టి. జి. కమలాదేవి, ధూళిపాళ ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు. ఈ

చిత్రంయొక్క కెమెరాను వి. ఎస్. ఆర్. స్వామి, ఆర్టును బి. ఎస్. కృష్ణ నిర్వహిస్తున్నారు. పూర్ణాపిక్చర్స్ విడుదల చెయ్యనున్న యీ చిత్రాన్ని గోపాలకృష్ణ నిర్మిస్తున్నాడు

**పాటల రికార్డింగుతో ఫల్గుణా పిక్చర్స్ చిత్రం ప్రారంభం!**

ప్రసాద్‌లో షూటింగు చూచుకొని, శారదాకు వెళ్ళాను. అక్కడ రికార్డింగు థియేటరుముందు నిలబడివున్న ఏకామ్రేశ్వరరావు నన్ను లోపలికి తీసికెళ్ళాడు; సంగీత దర్శకుడు కోదండపాణి తన ఆర్కెస్ట్రాను అరేంజి చేసివచ్చి సౌండు యింజనీరు ప్రక్కన కూర్చుని, వాల్యూమును సరిచేసుకుంటూ 'ఓకు చేద్దామా, ఈశ్వరి' అని అడగడం, ఆమె ఓకే అనడం, ఒక్కుమ్మడిగా వాయిద్యాలు నాట్యం చెయ్యడం జరిగిపోయాయి. నేను విన్నపాట యెవరు వ్రాసారు? ఏ చిత్రంలోది? అన్న విషయాల్ని మీకు తెల్పాలిగా.

విశ్వప్రసాద్ వ్రాసిన యీ పాట, ఫల్గుణా పిక్చర్స్ 'జగత్‌కి లాడీలు' చిత్రంలోది; ఆయన వ్రాసిన పాటయొక్క పల్లవి యిదిగో.

'నా అందం...యీ చందం
నా...సిగ్గు నిగ్గు కళ్ళ ఒళ్ళ
దాచుకున్నా, వేచివున్నా
దోచుకోరాజా, దోచుకో'

ఈ పాటను దర్శకుడు అయ్యన్ మూర్తి విజయలలిత మీద చిత్రీకరిస్తాడు.

'ఎక్కడున్న బావా అంటే ఒప్పుకుంటాను, వంగతోట కాడన్నావంటే తప్పుకుంటాను...' కొసరాజు రాసిన ఈ హాస్యరస ప్రధానమైన పాటనికూడా ఆరోజు రికార్డు చేశారు. బాలసుబ్రహ్మణ్యం, కొత్తగాయని విజయలక్ష్మి పాడారు.

ఏకామ్రేశ్వరరావు, రాఘవులు కలసి నిర్మించే యీ అపరాధ పరిశోధక చిత్రంలో వాణిశ్రీ, కృష్ణ, ఎస్. వి. రంగారావు, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, రాజబాబు, బాలకృష్ణ, మాలతి మరియు విజయలలిత ముఖ్య భూమికలను పోషిస్తారు. లక్ష్మీఫిలింస్ విడుదల చెయ్యనున్న యీ చిత్రంయొక్క షూటింగు జనవరి 10 నుండి శారదా స్టూడియోలో ప్రారంభమవుతుంది; ఈ చిత్రంయొక్క సంగీతాన్ని కోదండపాణి, సంభాషణలను విశ్వప్రసాద్, కెమెరాను కన్నప్ప, ఆర్టును బి. ఎస్. కృష్ణ నిర్వహిస్తారు.

**మనసారా ఆరాధించిన ప్రేయసి**

శారదా స్టూడియోనుండి నా దృష్టి గోల్డెన్‌వైపు మళ్ళింది; అక్కడ ఎం. వి. ఆర్. పిక్చర్స్ 'ముహూర్త బలం' చిత్రానికి సంబంధించిన పాట రికార్డింగు జరుగుతున్నట్టు పసిగట్టి లోపలికెళ్ళాను; లోపల దర్శకుడు మల్లికార్జునరావు, సంగీత సారథి కె. వి. మహదేవన్, నిర్మాత దాసు నన్ను సాదరంగా ఆహ్వానించి కూర్చోమన్నారు; థియేటర్లో ఒకమూలగా వేసివున్న కుర్చీలో ఆరుద్ర, మైకు ముందు సుశీల



'నిండు సంసారం'లో రమాప్రభ, బాలకృష్ణ

వుండడాన్ని గమనించాను; అంటే ఆరుద్ర వ్రాసిన పాటను సుశీల పాడుతుంది అని గ్రహించాను. ఆమె పాడిన పాట యొక్క పల్లవిని మీకూ తెలియచేస్తాను.

'నీకు ఎంత మనసుందో నాకు తెలుసునోయీ; నాకు ఎంత గుబులుందో నీకు తెలియదోయీ;' అనేది పాట; ఈ పాటను తెరపై యెవరు, యెందుకు పాడ్తారు అని దర్శకుడు మల్లికార్జునరావును ప్రశ్నించాను. దానికి ఆయన యిచ్చిన సమాధానం.

'బస్తీలో నాగభూషణం, జ్యోతిలక్ష్మిని తన ప్రియురాలిగా వుంచుకుంటాడు; ఆమెను తాత్కాలికంగానే ప్రేమిస్తాడు; ఒకరోజు నాగభూషణం తన ప్రేయసి కళ్ళుగప్పి గ్రామానికి వెళ్తాడు; గ్రామానికి వెళ్ళగానే జ్యోతిలక్ష్మిని పూర్తిగా మర్చిపోతాడు. కానీ జ్యోతిలక్ష్మి నాగభూషణాన్ని మనసారా ఆరాధించింది; అతని కోసమే జీవిస్తూ వుంది; తనలో యిమిడి వున్న ప్రేమను నాగభూషణానికి వెల్లడి చెయ్యాలనే తలంపుతోనే పై పాట పాడుతుంది' అన్నాడు మల్లికార్జునరావు.

## సన్నివేశానికి నిండుదనాన్ని చేకూర్చిన గానం

గోడౌన్‌నుండి యింటికి తిరిగివస్తుంటే

# సినిమా

మార్గమధ్యంలో రామచంద్రరావు సైకిలు రిక్షా తొక్కుతుంటే, పోలీసులువచ్చి అడ్డగించి లైసెన్సు వుందా అని అడగడం, అతనివద్ద లేకపోవడం, యికమీదట రిక్షా తొక్కకూడదని పోలీసులు హెచ్చరించడం, అతను దిగాలుముఖంతో, అక్కడే నిలబడిపోవడం, ఆ సమయానికి గుమ్మడియింట్లో నుండి వచ్చేసిన రాజబాబు అతన్ని సముదాయించి యింటికి తీసికెళ్ళడం చూచి వీళ్ళకి యీ గతేమిటబ్బా అనిపించింది; ఇదంతా నిజంగా జరిగిందనుకున్నాను. కానీ అల్లంత దూరంలో దర్శకుడు రామచంద్రరావును, కెమరామెన్ స్వామిని చూచి యిది 'అన్నదమ్ములు' చిత్రంలోనిదిఅని గ్రహించగల్గాను రాజబాబుకు రిక్షాను నేర్పించడానికి రామచంద్రరావు కూతురు మీనాకుమారి సంసిద్ధురాలౌతుంది; రాజబాబును బండి యెక్కమంటూ యిలా పాడసాగింది.

ఎక్కుమామా, బండెక్కు మామా;
ఎక్కకూర్చొని బండి తొక్కుమామా;

అని రాజబాబును ప్రోత్సహిస్తుంది; రాజబాబు ఆమెకన్నా ఘనుడేగా, అతనుకూడా యిలా ప్రారంభించాడు

'ఎక్కలేనే బుల్లీ, ఎక్కలేనే
బండి ఎక్కించినాగానీ తొక్కలేనే'

ఈ సన్నివేశాన్ని దర్శకుడు వి. రామచంద్రరావు చిత్రీకరించిన పద్ధతి, ఆ పాటకు రాజబాబు, మీనాకుమారి చూపిన నటన, ఆ పాటను మీరు మరీ మరీ వినాలనిపించే విధంగా పాడిన ఈశ్వరి, పిఠాపురంల గానం యీ సన్నివేశానికి నిండుదనాన్ని తీసుకురాగలదని నేను నమ్ముతున్నాను; డి. బి. నారాయణ అండ్ డి. రాంగోపాల్‌రెడ్డి నిర్మి



'సత్తెకాలపు సత్తెయ్య'లో నర్తకి సుశీల

## మీకు తెలుసా

విజయగార్డెన్స్‌లో నాగిరెడ్డిగారి కుమారుడి వివాహానికై నిర్మించబడ్డ ప్రత్యేక పందిరికి 50వేల రూపాయలు ఖర్చయిందట.

ప్రముఖ హాస్యనటుడు రాజబాబు మహాలింగపురంలో యిల్లు కొన్నాడు.

శ్రీ రాజనాల యింటి నిండా మహాకవులు వ్రాసిన గ్రంథాలు అన్ని భాషల్లో వున్నాయి.

'తెనాలిరామకృష్ణ' చిత్రంలో అక్కినేని నాగేశ్వరరావు ఆడవేషం వేసినట్లు మీకు తెలుసా?

శ్రీమతి సావిత్రి, నాగేశ్వరరావు అక్కా, తమ్ముళ్ళుగానటించిన చిత్రం 'పరివర్తన'.

ప్రముఖ సంగీత దర్శకుడు శ్రీ కె. వి. మహాదేవన్ ఒకానొకప్పుడు మద్రాసులో అనేక బాధలకు గురి అయ్యాడు. ఈనాడు అఖిలభారత స్థాయిలోని సంగీత దర్శకుడు కాగల్గాడు.

వద చిత్రానికి అవ్వలరాజా అమృత ధారా వాహినిని తన సంగీతంద్వారా కురిపించా నడం న్యాయమేమో ! ఈ చిత్రంలోని పాత్రలను కాంతారావు, రాజనాల, సత్యనారాయణ; రాజశ్రీ; విజయలలిత; జయంతి పోషించారు. మీకు మధ్యమధ్యన నవ్వు పుట్టించేందుకు రాజబాబు వుండనే వున్నాడు; మీకు హాయిలు కలిగించేందుకు జ్యోతిలక్ష్మి నృత్యాం ఒకటి వుంది; ఈ చిత్రం ఆంధ్రాలో పూర్ణా పిక్చర్స్ విడుదల చేస్తారు.

*   *   *

# వాణీ సాహిత్యా క్రాస్‌వర్డ్ పజిల్ నెం. 18

విఘంటువు : శబ్దార్థ చంద్రిక

(The District Collector Warangal. L. No.1 Dt. 8—10—67 నాకు కీ సొల్యూషన్ జిల్లా కలెక్టర్‌గారి కార్యాలయములో సీలు చేయబడినది)

## 1000 లు

## గెలుపొందండి !

ప్రథమ బహుమతి రు. **500** రైట్ ఆన్సర్

ద్వితీయ బహుమతి రు. **300** ఒక తప్పు ఆన్సర్

తృతీయ బహుమతి రు. **200** రెండు తప్పుల ఆన్సర్

నెం. 18 ఆధారములు

అడ్డము:— 1. వ్యాసమహర్షి 5. దుఃఖముకంటె నికంటె వేరేస్వర్గము లేదంటారు. ఉన్నవారిని యిదిపెట్టి పిలుచుట ...గనితోడ బుట్టిన స్త్రీ 9. ఇది ...స్వంతవరకే జీవిస్తాము 12. ...ల మనోభావాన్ని కొందరు యిట్టే గ్రహిస్తారు 13. సమీపము 14. ఒక చిటికె కాలములో నుచ్చరింప దగిన యక్షరము 16. ఈతనితో పాండువులదన్నారు పెద్దలు 19. సూర్యుడు 22. నడచుటలో గలుగు విలాసము 23. దీనిప్రకాశము చీకటి రాత్రులందు శోభనిచ్చును 24. సర్వసంగ పరిత్యాగియై మోక్షము నపేక్షించువాడు.

నిలువు:— 2 ఇది శివునికి ప్రియభూషణము 3. వరాభావము కలిగినవ్వాడు నేటికీ దీన్ని ఆచరించుట కద్దు . పాలసంద్రములో పొడమిన దీన్ని శివుడు తన కంఠమందు నిలిపి లోకాలను రక్షించెనట 8. ప్రియురాలు 10. సమస్త జీవరాసుల నివాసమున కాకరమైనచోటు 11. మన దేశపు చిహ్నంగా దీన్ని త్రివర్ణములో రూపొందించారు 12. ఒకసారి సేవింపదగిన యౌషధ పరిమాణము 15. ఈతని సత్కారము దైవపూజకన్న మిన్నయట 17. మలిన వస్త్రములను శుద్ధిచేయువాడు 18. కాలయాపనము 20. దీనిలోని నీరు తరచు ఉప్పుగా నుండును 21. ద్వాపరయుగ మందుండిన ఒకానొక యవతార పురుషుడు.



ముగింపు తేది : 10—1—1969

## కూపను ఒక్కంటికి ఒక్క రూపాయి మాత్రమే

నిబంధనలు:— 1. కూపనులు తుడుపులు, కొట్టివేతలులేకుండా తెల్లకాగితముపై చదరము గళ్ళరూపములో గీసి చక్కగా సిరాతో వ్రాసి పంపవలెను. ...గా 30 పైసల పోస్టేజి పంపినచో అచ్చు కూపనులు పంపుదుము. కాని లిస్టు రూపములో వ్రాయబడిన కూపనులు చెల్లనేరవు. 2. ప్రవేశ రుసుము ప్రతికూపనుకు ఒక్క రూపాయి చొప్పున నగదురూపమునగాని, మనియార్డర్ లేక క్రాస్‌చేయని పోస్టల్ ఆర్డర్ ద్వారాగాని పంపాలి. మనియార్డరు M. O. రసీదు కూపనుతో తప్పక జతచేసిపంపవలెను. లేనిచో కూపనులు పోటీలో నుంచబడవు. 3. ఒకపేరుతో రెండు కూపనులకంటె ఎక్కువ పంపరాదు. ప్రతి కూపనుపైన మరియు పోస్టల్ ఆర్డరు, మనియార్డర్ ఫారములవెనుక భాగమున తప్పక పోటీదారుని పూర్తిపేరు, అడ్రసు స్పష్టముగా వ్రాయవలెను. 4. కూపనులు ముగింపుతేది సాయంత్రం 8 గంటలలోపుగా మాకు చేరునట్లు పంపాలి నియమిత సమయం దాటిన తరువాత వచ్చిన కూపనులు పోటీలో చేర్చబడవు. 5. ఈ పజిల్సులో ప్రతిపోటీదారు తాముపంపే రైటుమొదలు రెండు తప్పులవరకుగల ప్రతి కూపనుకు బహుమతి పొందవచ్చును 6. A. కీ సొల్యూషను మాత్రం 'ఆంధ్ర పత్రిక' తెలుగు దినపత్రికలో ముగింపు తేది తరువాత పదిరోజులలో ప్రకటించబడును. విజేతల లిస్టు, కొత్త పజిల్ కూపనులు వగైరా కావలసినవారు 30 పైసల పోస్టేజి పంపి తెప్పించుకొనవలెను. 6.B. తమ కూపనుల పునః పరిశీలన కోరే పోటీదారులు విజేతల లిస్టు ప్రకటించబడిన తేదీలగాయతు 30 దినములలోపుగా రూ. 5లు స్క్రూటినీ ఫీజు క్రింద మనియార్డరుద్వారా పంపుతూ ఒకదరఖాస్తు స్క్రూటినీ కమిటీ చైర్మన్ గారిపేర వ్రాసి M. O. రశీదు దానితో తప్పక జతపరచి మేనేజర్ అడ్రసుకు పంపవలెను. అప్పుడు త్వరలో కమిటీ నిర్ణయాన్ని పోటీదారులకు తెలుపుదుము అట్టిపోటీదారులు విజేతలయ్యెనచో రావలసినబహుమతి మొత్తముతోపాటు స్క్రూటినీ ఫీజు కూడ తిరిగి పంపించబడును. కానిచో స్క్రూటినీ ఫీజు వాపసుచేయబడదు. నిశ్చిత గడువు దాటినతరువాత ఎట్టి ఆక్షేపణలు అంగీకరించ బడవు. 7. కీ సొల్యూషన్‌లోని మాటకు సరిపోని ప్రతిమాట ఒక తప్పుగా నెంచబడును. 8. ఈ పజిలుతాలూకు అన్ని విషయములలో మేనేజరుదే తుదినిర్ణయము. 9. ఇండియాలో తప్పయితర దేశములలో నివసించువారు ఈ పోటీలో పాల్గొనుట నిషేధించబడినది. 10. పై నిబంధనలు ప్రభుత్వ చట్టము ననుసరించి రూపొందించ బడినవి. కావున పోటీదారులెల్లరు పాటించి సహకరింప గోరుచున్నాము. 11. కూపనులు మనియార్డర్లు వగైరా ఈ క్రింది అడ్రసుకు మాత్రమే పంపాలి.

The Manager, **Sri Vani Sahitya Puzzles**, Warangal-2. (A.P.)

## శ్రీ వాణీ సాహిత్య పజిల్ నెం. *16* కి సొల్యూషన్

అడ్డము: 1. శ్రీరామకృష్ణపరమహంస 8. జీనసిదు 10. తగరు 12. బర్కారము 15. సృష్టి 16 జాత 17. వటి 18. దున్న 19. వమ్ము 20. నీరు 23. తోయధి 24. లిక్కు 25. వరానము.

నిలువు: 2. రాక 3. కృశానువు 4. వస్తు 5. మరకతము 6. సహ్యజ 7. ప్రజాత 9. తర్కము 11. గరిత 13. విష్టి 14. కిసలయము 18. దుమ్ములు 21. రుసుము 22. పులి.

విజేతల లిస్టు వలయువారు 30 పైII. పోస్టేజి పంపి తెప్పించుకొనవలెను. మేనేజరు, శ్రీ వాణీ సాహిత్య పజిల్స్, వరంగల్-2.

# సినిమా

## కలియుగపు అలవాట్లు అబ్బని వ్యక్తి

లోకం పోకడ తెలియని చలం, రోజా రమణి సాంగత్యంవల్ల ప్రపంచ పరిస్థితుల్ని క్రమక్రమంగా అర్థం చేసుకోగల పాండిత్యాన్ని పొందుతున్నాడు; కానీ అతనికి నేటి కలియుగపు టలవాట్లు అబ్బడం లేదు; మంచికోసం యేమయినా చెయ్యగల సాహసి; ఒక పసిపాప అనురాగ, అనుబంధాల్లో యిరుక్కుపోయాడు చలం; అతనికి వున్నదల్లా ఒక్కటే: అదే ఆ పాప; ఆ పాప యెవరిది? గుమ్మడి, ఎస్వరలక్ష్మిల ముద్దులపట్టి; మరి ఆ పాపపై యితనికి మక్కువ యెలా యేర్పడింది? అదే విధివిలాసం. ఏ నిమిషంలో యెవరికి, యేది, యెలా జరగాలో అది జరిగితీరుతుంది అనెడి ప్రత్యక్ష సత్యాన్ని నిరూపించే చక్కటి సాంఘికం ప్రసాద్ ఆర్ట్సు నిర్మించిన 'సత్తెకాలపుసత్తెయ్య.' కె. బాలచందర్ దర్శకత్వంలో సర్వజన రంజితంగా నిర్మితమయిన యీ చిత్రాన్ని సినిసెట్టి తన సంభాషణా చాతుర్యంతో మిమ్మల్ని ఆకట్టుకోడానికి ఒకప్రక్క ప్రయత్నిస్తే, ఎం. ఎస్. విశ్వనాథం తన సుమధుర సంగీతంతో మిమ్మల్ని మైమరిపించాలని మరోప్రక్క కృషిచేస్తే, విజయలలిత, చలం, రోజారమణి తమ నటనా చాతుర్యంతో మిమ్మల్ని విస్మితుల్ని చెయ్యాలని ప్రయత్నించారు; మంచికథ, మంచి సాంకేతిక విలువలు, మంచినటన, మంచిమంచి పాటలువున్న యీ చిత్రాన్ని ప్రసాద్ నిర్మించాడు; ఈ చిత్రాన్ని జనవరి రెండవ వారంలో పూర్ణా పిక్చర్స్ విడుదల చేస్తున్నారు.

## వివాహం

సహజసౌందర్యంతో విలసిల్లే విజయా గార్డెన్స్, నాగిరెడ్డిగారి కుమారుడు చిరంజీవి వెంకట్రామరెడ్డి కళ్యాణ సంరంభంతో యినుమడించింది. అది డిసెంబరు తొమ్మిదో తారీఖు. సమయం ఉదయం తొమ్మిదిగంటలు. నేను టాక్సీని గార్డెన్స్ లోకి మళ్ళించాను; నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను. ఎందుకో తెలుసా? గార్డెన్స్‌కు నలువైపులా బాడీగార్డుల్లాగా వివిధరకాలయిన కార్లు పార్కు చెయ్యబడివున్నాయి. వేలాది జనం వధూవరులను ఆశీర్వదించడానికై విచ్చేసివున్నారు. తెలుగు, తమిళ, మళయాల, కన్నడ, హింది చిత్రరంగానికి చెందిన ప్రముఖులు ముహూర్తానికి హాజరై, చిలకాగోరింకల్లా సాక్షాత్కరించిన సౌభాగ్యవతి భారతిని, చిరంజీవి



'ఆనందనిలయం'లో కృష్ణకుమారి, హేమలత.



'ఇంద్రపోటుదొంగలు'లో

వెంకట్రామరెడ్డిని మనసారా వివాహానికి వచ్చిన ప్రతివారినీ హస్తాలతో శ్రీ నాగిరెడ్డి వారిని సాదరంగా సత్కరించ రంగుల బెనారస్ పట్టుజరిచీరెల జిగేలు మనిపించే మన గ్నామణుల రాకతో విజయ దేవేంద్రలోకాన్ని మరిపించిందిఅని అనిపిస్తుంది. తమ పుత్రుని సందర్భంగా డిసెంబరు 9 వ వాహిని స్టుడియోలకు విశ్రాంతి నాగిరెడ్డిగారు; సినిమారంగంలో ఘనంగా జరిగిన వివాహం యిదేనని పిస్తుంది.

— శ్రీనివా